# సర్వము - శూన్యము

మూలము :- **మెహెర్ బాబా**



తెలుగు సేత :

**శ్రీ జి.వి.జి.కె. చంద్రమౌళీశ్వరరావు (మెహెర్ చంద్ర)**

# సర్వము - శూన్యము

## (THE EVERYTHING AND THE NOTHING)

మూలము :- **మెహెర్ బాబా**



తెలుగు సేత :

**శ్రీ జి.వి.జి.కె. చంద్రమౌళీశ్వరరావు (మెహెర్ చంద్ర)**

ప్రచురణ కర్త :

**శ్రీ తాడేపల్లి హనుమంతరావు**

ఇంటి నం. 11-45-125 తవ్వా వారి వీధి

విజయవాడ - 520 001

సర్వము - శూన్యము,
(అవతార్ మెహెర్‌బాబా పర్పెక్చువల్ పబ్లిక్ చారిటబుల్ ట్రష్టు,
కింగ్స్ రోడ్డు, అహ్మదు నగరు మహారాష్ట్ర వారి సౌజన్యంతో)

మూలము :
**అవతార్ మెహెర్‌బాబా**

తెలుగు సేత :
**శ్రీ జి.వి.జి.కె. చంద్రమౌళీశ్వరరావు (మెహెర్ చంద్ర)**

ప్రధమ ముద్రణ :- 21-9-1997
ప్రతులు :- 500

వెల :- రూ. 20-00

ప్రతులకు :
**శ్రీ తాడేపల్లి హనుమంతరావు,**
ఇంటి నం. 11-45-125
తవ్వావారి వీధి,
విజయవాడ - 1.

లేజర్ ప్రింటింగ్ :
శ్రీ సాయిరామ్ డి.టి.పి.

# విజ్ఞాపన

అవతార్ మెహెర్‌బాబా మచిలీపట్నం సెంటరు ద్వారా మా అన్నయ్య కీ॥శే॥ తాడేప;ల్లి బసవయ్యగారి సహకారంతో సో॥ జి.వి.జి.కె. చంద్రమౌళీశ్వరరావుగారు యిప్పటివరకు గణనీయమైన సంఖ్యలో మెహెర్‌బాబా సాహిత్యాన్ని పుస్తక రూపంలో ప్రచురించారు. ఆయన వెల్వరించిన ప్రతి పుస్తకంలో ప్రియతమ మెహెర్‌బాబా గురించి ఆయన అవతార విశిష్టత గురించి, సంక్షిప్త జీవిత చరిత్రతో పాటు అందించుట జరిగింది. అవతారుడు అందించిన గంభీరమైన ఆధ్యాత్మిక విలువల్ని తేటతెలుగులో, సులభశైలిలో, పాఠకుల మనోఫలకంపై చెరగని ముద్ర పడేలా వ్రాయటం, శ్రీ మెహెర్‌చంద్రగారి విశిష్టత.

ప్రియతమ బాబా 103వ జన్మదినోత్సవ శుభసందర్భంగా బాబా సాహిత్యాన్ని ప్రచురించాలన్న తలంపు విజయవాడ సెంటరులో జన్మదినోత్సవ కార్యక్రమాలు ప్రారంభిస్తున్న తరుణంలో నాకు కలిగింది. వెంటనే శ్రీ చంద్రమౌళీశ్వరరావుగారిని కలిసి, బాబా సత్యప్రేమ సందేశాలపై ఏదైనా వ్రాసి యిస్తే పుస్తక రూపంలో ప్రచురించదలచానని చెప్పగా, "సర్వము-శూన్యము" తెలుగు అనువాద పుస్తకాలు అందుబాటులో లేనందున, దాని అనువాదాన్ని తాను ఇంతకుముందే వ్రాసి ఉన్నందున అది ప్రచురించమని కోరారు. ఆస్ట్రేలియా బీకన్‌హిల్ మెహెర్ హౌస్‌వారి అనుమతిని ఇంతకుముందే పొంది ఉన్నందున ఇప్పుడీ అనువాదాన్ని ప్రచురించే అవకాశం కలిగింది. ప్రచురణలో కొంత జాప్యం జరిగినా, అవతార్ మెహెర్‌బాబా నూజివీడు సెంటరు 30వ వార్షికోత్సవ సందర్భంగా జరుగుతున్న మెహెర్ దర్బార్‌లో దీని ఆవిష్కరణ జరగటం నాకెంతో ఆనందంగా ఉన్నది. మెహెర్ ప్రభు సేవలో భాగంగా చేస్తున్న యీ కృషిలో ప్రతివారు సహకరించి ప్రోత్సహించవలసిందిగా కోరుతున్నాను. అందరికీ జై బాబా.

విజయవాడ — మీ విధేయుడు

21-2-97 — తాడేపల్లి హనుమంతరావు

# తొలిపలుకు

అవతార్ మెహెర్‌బాబా తన శిష్యులకు 1959-60 ప్రాంతంలో స్వయంగా తన చేతి సౌంజ్ఞల ద్వారా అందించిన ఉపదేశాల్ని సో॥ ఫ్రాన్సిస్ బ్రాబాజాన్ 'సర్వము - శూన్యము' అనే పేరుతో గ్రంథస్తం చేశారు. మహనీయమైన యీ ఉద్గ్రంథపు తెలుగు అనువాదాన్ని చాలాకాలం క్రితమే నేను పూర్తి చేసినా ప్రియతముని ఇచ్ఛ ప్రకారం యిప్పటికి ప్రచురితమయ్యే అవకాశం కలగటం బాబా ఇచ్ఛగా భావిస్తున్నాను. అవతార్ మెహెర్‌బాబా తన అవతార కాలంలో ఇంతవరకు వెలుగు చూడని ఎన్నో ఆధ్యాత్మిక రహస్యాల్ని బహిర్గతపరచారు. ఎవరెంత పంచుకున్నా తరగతిని దైవ సంపదను ఆయన మనకు అందించారు. ఇటువంటి దైవ సంపదను తెలుగులో అందించాలన్న సంకల్పంతో నేను యిప్పటివరకూ 26 సంకలనాలను వెలువరించటం జరిగింది.

మహనీయమైన ఈ ఉద్గ్రంథాన్ని తెలుగులో అనువదించే అదృష్టం నాకు కలగటం నా పూర్వజన్మ సుకృతం. బాబా సాహిత్యంలో "సర్వము-శూన్యము' ' అనే గ్రంథం ఒక మణిపూస వంటిది. ఇందలి విషయాలు, పైకి సాధారణంగా కనిపించినా, వాటి వెనుక, ఒక మహత్తరమైన అంతరార్థము ఉన్నది. ఆత్మ-పరమాత్మ సంబంధం గురించిన తత్వ విషయాలెన్నో ఇందులో యిమిడి ఉన్నాయి. రసజ్ఞులైన పాఠకులు వీటిని గ్రహించుట ద్వారా అవతారుని కృపకు పాత్రులై ఆధ్యాత్మిక లబ్ధిని పొందగలరని ఆకాంక్షిస్తూ నా ఇతర రచనల మాదిరే దీనిని ఆదరించకోరుతున్నాను.

సకాలంలో అత్యంత సుందరంగా లేజరు ప్రింటు చేసి అందించిన శ్రీ సాయిరామ్ డి.టి.పి. విజయవాడ వారికి కృతజ్ఞతలు తెలుపుకుంటూ, బాబావారి 103వ జన్మదినోత్సవంనాడే ఆవిష్కరించాలని సంకల్పించినా అనివార్యకారణాల వల్ల ఆలశ్యమై, నూజివీడు సెంటరు 30వ వార్షికోత్సవం నాడు శ్రీ సి. తిరుపతిరావు ఆకాశవాణి కేంద్ర పర్యవేక్షక ఇంజనీరు గారిచే ఆవిష్కరించబడటం ప్రియతముని ఇచ్ఛగా భావిస్తూ అందరికీ జై బాబా అందిస్తున్నాను.

జి.వి.జి.కె. చంద్రమౌళీశ్వరరావు (మెహెర్‌చంద్ర)

# తొలిపలుకు

ఆంగ్ల భాషలోని Everything & Nothing అనే గ్రంథానికి "సర్వము - శూన్యము" అనునది ఆంధ్రానువాదం. అనువాదకులు సో॥ జి.వి.జి.కె. చంద్రమౌళీశ్వరరావు (మెహెర్‌చంద్ర) గారు బాబా ప్రేమికలోకానికి చిరపరిచితులే!

సర్వము - శూన్యము అను గ్రంథము చిన్నదైనప్పటికి - చాలా విలువ గల్గినది. అవతార్ మెహెర్‌బాబా యిచ్చిన అతిముఖ్యమైన సందేశములు, ఆధ్యాత్మికమార్గంలో పయనించే యాత్రికులందరకు అపారమైన స్ఫూర్తిని ఇస్తుంది. మన ఏకమానవ జాతి యొక్క ఆధ్యాత్మిక సంపదకు ఎంతగానో సహాయపడుతుంది. ఈ తరమువారికే గాక ముందు తరములవారికి గూడ సరియైన జ్ఞానభివృద్ధి కలిగి లాభిస్తుంది.

ఇందలి సందేశములన్నియు అవతార్ మెహెర్‌బాబా సంపూర్ణ మౌనము పాటిస్తూ ఉన్నా తన హస్త సౌంజ్ఞలతోనే యివ్వడం జరిగింది.

అవతార్ మెహెర్‌బాబా రచనలలో వెలువడిన పెద్ద పెద్ద రచనలన్నిటికి ఈ చిన్న పుస్తకము మార్గదర్శినియై యున్నది. ఒక్కొక్కప్పుడు పెద్ద గ్రంథములు సాధింపజాలని ప్రయోజనమును చిన్న గ్రంథము సాధింపవచ్చును.

అవతార్ మెహెర్‌బాబా, మన ప్రియ సోదరుడు తాడేపల్లి హనుమంతరావు గార్కి హృదయములో కలిగించిన ప్రేరణచే, ముందుకు వచ్చి ఈ గ్రంథమును తెలుగు భాషలో ప్రచురించుటకు సాహసించిరి. వారి సదభిప్రాయము, ఇంగ్లీషు భాష పరిచయము లేని ఆంధ్రులకు ముఖ్యముగా తెలుగుభాష ద్వారా ఈ అమూల్య సందేశములను అందించవలెననెడి ఊహ!

దైవమానవునిచే మానవునకు ప్రసాదించబడిన ఆధ్యాత్మిక విషయములను పఠించుట ద్వారా తెలుగుదేశమందలి పాఠకలోకము అత్యధిక ప్రయోజనము పొందగలదని నేను విశ్వసిస్తూ, ఇటువంటి అమూల్యమైన మరిన్ని రచనలు సో॥ మెహెర్‌చంద్రగారి కలం నుండి వెలువరించే శక్తిని ప్రియతమ బాబా వారికి కలిగించాలని ప్రార్థిస్తున్నాను.

ఎ.వి. రాఘవులు,
జనరల్ సెక్రటరీ,
అవతార్‌మెహెర్ బాబా, ఆంధ్రా సెంటరు, విజయవాడ.

# పీఠిక

గత రెండు మూడేళ్లుగా యీ ప్రవచనాల్ని తన శిష్యులకందించిన, ఆత్మలకన్నిటికి ఆత్మయై, ప్రతి హృదయాన్ని తన మందిరంగా మరల్చుకున్న ఆ ఏకైకుడిని గురించిన పరిచయమక్కర్లేదు. అయితే యీ విషయాన్ని మనము మరచినందున, యీ సృష్టికి ముందే వుండి, సర్వము నశించిన పిదప వుండే సనాతనుడిగా తనను తాను మానవులకు పునఃపరిచయము చేసుకున్నాడాయన.

ఆదిలో జీససనే క్రీస్తుగా, గౌతముడనే బుద్ధుడుగా, కృష్ణుడనే ప్రేమికుడుగా, రాముడనే రాజుగా ఆయన ప్రసిద్ధిచెందాడు. ఈసారి, ఆయన మెహెర్‌బాబా అనిపిలువబడుచున్నాడు. పిమ్మట, ఆయన తన పాంచభౌతిక శరీర పరిత్యాగం చేసిన తర్వాత, బహుశః మానవులాయన పేరు చివర "మేల్కొలుపువాడ"ని చేర్చవచ్చును. ఎందుకంటే, "నేను బోధించుటకు రాలేదు. మేలుకొలుపుటకే వచ్చాను" అని ఆయన చెప్పారు.

తాను భగవంతుడనని, పరిపూర్ణ సత్యమే తానని, మెహెర్‌బాబా స్థిరంగా చెప్పారు. యింకా చెపుతూ, తానీ రూపాన్ని కేవలం, వ్యధ చెందే మానవాళియందు తనకున్న దయవల్లనే ధరించానని చెప్పారు. మానవుల వేదన అత్యధికంగా వున్నది. ప్రచార కార్యక్రమాలెన్ని చేసినా, విషయాలెన్నటికీ చక్కబడకపోగా, మానవుని బాధలధికమై, తననూ తన అంకురాన్నే నాశనం చేసే స్వీయ వినాశకర సాధనాల్ని మానవుడు కనిపెట్టాడు. ఇప్పుడు జ్ఞానుల మనస్సుల్లో ఆవరించి వున్న ప్రశ్న ఏమంటే, యీ వినాశనాన్ని ఏ విధంగా నివారించగలమన్నదే - ఎందుకంటే, యిటువంటి వినాశకర శక్తి దాన్ని పరిరక్షించే అర్హత గల నీతిమంతుల చేతుల్లో లేదు.

ఇటువంటి ఆలోచన స్పష్టమైన ప్రవాహ రూపములలో వుండక, అల్లకల్లోలంగా వుండే మహాసముద్రపు అడ్డదిడ్డ ప్రవాహంలా నిరంతర జీవితాన్ని ప్రసాదించే అభయమివ్వగల "ఏదో వస్తువు" ధర్మప్రభోదకుల దృష్టిలో అన్ని మతాలు అభయమిచ్చే జగద్రక్షకుడైన "ఒకానొకడు" గా మారిపోయింది.

ఈ "ఏదో ఒక వస్తువు" లేదా "ఒకానొకడు" తానేనని, మెహెర్‌బాబా చెపుతూ "అనేకమంది అన్వేషిస్తూ బహుకొద్ది మంది మాత్రమే కనుగొనే ఆ ఏకైకుడను నేనే" అన్నారు.

సహజంగా చాలామంది యీ మాటల్ని అంగీకరించరు. వాస్తవానికి, మానవులంతా ఒకవైపున, యీ ప్రపంచాన్ని రక్షించమని ఆ "ఒకానొకరి"ని లేదా "ఒకానొక వస్తువు"ను

ప్రార్థిస్తుంటే, మరో వైపు తానే దేముడినని నమ్ముతున్న యీ మానవుడి మహావంచన నుండి కాపాడమని మరికొందరు ప్రార్థిస్తున్నారు !

కానీ, మనం దాన్ని ఆమోదించేంత వరకు సత్యమెన్నటికీ వేచివుండదు. అయితే గాలివాటంలా తన సుమధుర ఇచ్ఛ ప్రకారమది ప్రకటించుకుంటుంది. "నేను మానవుడను" అని మనము ఖచ్చితంగా చెప్పుట అంతే సహజము. నేను మనిషిని కానని మనం చెప్పుట యెంత సహజమో, అలాగే దైవీ మానవుడికి "నేను భగవంతుడను" అని ఖచ్చితంగా చెప్పుట అంతే సహజము. నేను మనిషిని కానని మనం చెప్పుటమెంత అసహజమో, దైవీ మానవుడు నేను భగవంతుడను కాను అని చెప్పుట అంత హాశ్యాస్పదము. దివ్య సత్యముల గూర్చి మనకున్న అజ్ఞానము బ్రహ్మాండమంత కాగా భగవంతుని గురించి మనకున్న భావాలు మాత్రం ఇంకా ప్రాధమిక స్థాయే !

భగవంతుని దైవీ మానవునిగా ఒప్పుకొనేందుకు కొంతధైర్యం కావాలి. ఒప్పుకోవడమంటే, స్వీయాహంకార జీవితాన్నర్పించుకోవటం. ఏమైనప్పటికీ, మనం పెంచి పోషించే యీ జీవితాలు ఇక ఎంతో కాలం మనవి కానందున ఇహ గుండీలు నొక్కమని ఆదేశించే పని ఆ ఆదిపురుషుని చేతుల యందున్నందున, సర్వార్పణ ఏమంత కష్టం కాబోదు!

కానీ, "ఒకానొకడు" లేదా "ఒకానొక వస్తువు" ను ఆశించి, దైవీ మానవుడి అవతరణను తిరస్కరించేవారు ఆయన ప్రకటిస్తున్నట్లుగా అవతారుడు కాడని వారు ఋజువు చేయలేరు గనుక, వీరే వాస్తవానికి దైవీమానవునికి సర్వార్పణైన వారి కంటే అధిక ధైర్యవంతులు.

మరి వీరికంటే కూడ పశ్చిమాన పురోగమిస్తున్న కృత్రిమ వెలుగుననుసరించేవారు మరింత ధైర్యవంతులు. కాగా భగవంతుడిని, ఆ సుందరమౌనమూర్తి ఒక నవమానవాళి యొక్క అరుణోదయంతో ప్రాగ్దిశాకాశంపై ఇదివరకే వెలిగించారు. అతిత్వరలోనే ఆయన పలుకులు సూర్యబింబమై ప్రపంచాన్ని భేదించుకొని బయలు వెడలి ఆయన ఘనవైభవము సర్వులకు విశదపడుతుంది.

ఈలోగా యీ గ్రంథంలోని ప్రవచనములను తన చేతి సౌంజ్ఞల ద్వారా మెహెర్‌బాబాచే మౌనంలో ప్రవచింపబడినవి. తాను మౌనవిరమణ చేసి, తన దైవత్వాన్ని మానవులకు స్పష్టపరచినప్పుడు ఉచ్ఛరించు సత్యము యొక్క ఏకైక శబ్దానికి సూచనలుగా వీటిని చెప్పవచ్చును. సర్వము-శూన్యము అనే యీ గ్రంథంలో వివరాలన్నీ, తాను మాట్లాడినప్పుడు వెలువడే, సత్యము యొక్క ఏకైక పదమును స్వీకరించకలిగేందుకు, మనస్సును, హృదయాన్ని సన్నద్ధం చేసే యత్నమే ఇది.

**1 నవంబరు 1962** - ఫ్రాన్సిస్ బ్రాబజాన్



## జీవిత చరిత్ర

మెహెర్ బాబా 1894 లో ఇరానీ దంపతులకు ఇండియాలో జన్మించారు. ఆయన 19 ఏళ్ల ప్రాయంలో సద్గుర్విణి బాబా జాన్‌ను కలవగా, ఆమె ఆయన్ని తన దైవత్వాన్ని గుర్తించేట్లు చేసింది. ఏడేళ్ల తర్వాత మరో సద్గురువు ఉపాసినీ మహరాజు ఈయన్ని తన దైవీ మానవస్థితిలో ప్రతిష్టించారు. 1925లో ఆయన మౌనాన్ని వహించి, ఆంగ్ల అక్షర ఫలకంపైన, చేతి సౌంజ్ఞలతోనూ తన భావాలను వ్యక్తపరుస్తూ మౌనంతోనే ఉండిపోయారు. ఆయనచే ప్రచురించబడిన యీ క్రింది పుస్తకాలన్నీ యీ విధంగానే చెప్పి వ్రాయించబడినవి. డాడ్‌మీడ్ అండ్ కో న్యూయార్కు ప్రచురణ భగవద్వచనములు.

డా॥ సి.డి. దేశ్‌ముఖ్ ఎం.ఎ. పి.హెచ్.డి. మెహెర్ పబ్లికేషన్సు అహ్మదునగర్ వారి ప్రచురణ ప్రవచనములు 5 భాగాలు. దైవం నుండి మానవుడు మరియు మానవుడి నుండి దైవము అనే పేరుతో ఇదే ప్రవచనములను పునః ప్రచురణలు చేసి లండన్ వాసి సి.బి. పర్డమ్ ప్రచురించారు.



"సత్యమునుండి వెలువడ్డ పదములు సరియైన
అర్థములు కలిగియుండును. కానీ మానవులు
ఈ పదములను తమ స్వంతవానిగా వుచ్చరించిన,
అవి అర్థరహితములగును".

# విషయసూచిక

1. ప్రేమికుడు - ప్రియతముడు ........ 13
2. ప్రేమ - మధువు ........ 14
3. ప్రేమ - అంతరములు ........ 15
4. ప్రేమ - కానుకలు ........ 16
5. స్త్రీ మరియు భగవంతుని ప్రేమ ........ 17
6. పరాయివారంటే భగవంతునికి సిగ్గు ........ 18
7. సంపూర్ణ నిజాయితీ ........ 19
8. ఆపాదమస్తక శూన్య స్థితి ........ 20
9. పయనించని ప్రయాణము ........ 21
10. అనుమానాస్పద అధిక ప్రసంగి ........ 22
11. త్రివిధ స్వల్పానుభూతులు ........ 23
12. త్రివిధ వర్గాలు ........ 23
13. అన్వేషించకు - నీవు కాంచెదవు ........ 25
14. భగవంతుడు అన్వేషించును ........ 27
15. ముత్యాలకై మునిగేవాడు ........ 28
16. చతుర్విధ ప్రయాణములు ........ 30
17. మధువ్యాపారి ........ 34
18. అనంతస్వరూపుడే సద్గురువు ........ 36
19. భగవంతుని నటన ........ 39
20. ఒక దురవస్థ ........ 40
21. జ్ఞానభిక్ష ........ 40
22. జ్ఞాన రకములు ........ 42
23. పరిచయములు ........ 43

24. సహవాస సూక్తులు ....................44
25. గైరుహాజరు కాకండి ....................45
26. నేను కోరునదే కోరుడు ....................46
27. మీ విధేయతా పారితోషికము ....................48
28. దేవుని ప్రతిస్పందన ....................48
29. ప్రశ్నార్థక మనస్సు ....................50
30. జాగ్రద స్వప్నావస్థ నుండి నిజమైన జాగ్రదవస్థకు చేరుట ....................55
31. అనంత చైతన్యాన్ని నేనే ....................60
32. ఆ పాటను నేనే ....................60
33. అనంతజ్ఞానము ....................61
34. విశ్వాత్మక శరీరము (విశ్వ రూపము) ....................61
35. తృటిమాత్రములో సమస్తము ఎరుగుట ....................62
36. తెలుసుకొనుట మరియు తెలుసుకొనలేకపోవుట ....................63
37. ఇచ్ఛ మరియు బాధ ....................64
38. నా హృదయముపై హాశ్యము ....................65
39. జ్ఞానము ....................66
40. మాయ మార్గదర్శి ....................68
41. సత్యము, మాయల సంధిలో ....................60
42. నా శిరో కేంద్రము ....................70
43. దైవ క్రీడలో (పావులు) బొమ్మలు ....................71
44. భగవంతుడు మాత్రమే ఉన్నాడు ....................75
45. ఆధ్యాత్మిక సంచలనము ....................76
46. గుర్తుంచుకొని మరచిన పరమాత్మ ....................76
47. ప్రశ్న దాని జవాబు ....................76
48. శాతములు ....................77

49. పరమాత్మలో అనంతాత్మలు .......................................................78
50. ఏకము మరియు సున్న .......................................................80
51. అసలైన నిరాలంబ శూన్యము .......................................................82
52. సృష్టి పరంపర .......................................................84
53. వస్తు గుణ స్వప్నము .......................................................85
54. వర్తమానము .......................................................87
55. దైవమున్నాడు .......................................................88
56. అవిభాజ్యమైన ఏకత్వమును అనంత వ్యక్తిత్వము ప్రకటించుట ....90
57. మూడు లక్షణాలు .......................................................92
58. సత్యము పరమాత్మదైతే చట్టము మాయది .......................................................93
59. శక్తి జ్ఞానానందముల ఛాయలు .......................................................94
60. జగత్తు ఒక కారాగారము .......................................................95
61. అనంత అస్తిత్వములో ప్రయోజకత్వము .......................................................96
62. మానసిక చైతన్యము .......................................................98
63. అవతారుని కార్య విధానము .......................................................103
64. క్షమించి మరచిపో .......................................................109
65. అజ్ఞానపు వ్యక్తీకరణము .......................................................111



# 1. ప్రేమికుడు - ప్రియతముడు

భగవంతుడే ప్రేమ. మరి ప్రేమ ప్రేమించబడాలి. మరి ప్రేమించాలంటే ప్రియతముడొకరుండి తీరాలి. అయితే ప్రేమించేందుకాయనకు ఆయనే తప్ప తదన్యులెవరూ లేరు. అందుకే ఆయన తనను తాను ప్రేమించేందుకు తననే ఆ ప్రియతముడిగా వూహించి అట్టి ప్రియతముడ్ని ప్రేమించే ప్రేమికుడిగా వూహించి తానే ప్రేమించవలసియున్నది.

ప్రియతముడు, ప్రేమికుడు అన్నవి ఎడబాటు భావాన్ని స్ఫురింపచేస్తాయి. మరి ఎడబాటు తీరని తితీక్షను సృష్టిస్తుంది. మరి యీ తితీక్షే అన్వేషణకు కారణమవుతుంది. ఈ అన్వేషణ ఎంత ఎక్కువైతే, ఎడబాటు అంత అధికమై, తితీక్ష ఇంకా ఎక్కువ భయంకరమౌతుంది.

ఈ తితీక్ష తన ఎడబాటు యొక్క అత్యున్నతస్థితికి చేరటం పూర్తయినప్పుడు, మరియు ఎడబాటు యొక్క ముఖ్యోద్దేశ్యమైన, ప్రేమ తనకు తానే ప్రేమికునిగాను, ప్రియతమునిగానూ వూహించుకొని అనుభవించుట నెరవేరిన వెనువెంటనే సమైక్యము అనుసరిస్తుంది. మరి ఇట్టి సమైక్యత సిద్ధించినప్పుడు ప్రేమికుడు, తాను ఇంతకాలము ఏ ప్రియతముని ప్రేమించాడో, ఆ ప్రియతముడు తానూ ఒక్కరేనని తెలుసుకుంటాడు మరియు తానంత వరకూ ఎదుర్కొన్న సంక్లిష్ట పరిస్థితులన్నీ తనకు తానుగా తన మార్గంలో కల్పించుకున్న అవరోధాలుగా గుర్తిస్తాడు.

సమైక్యమవటం చాలా కష్టతరమైనది. ఎందుకంటే, నీ వింతకు ముందే ఏ దైవున్నావో ఆ స్థితికి మారుట ఆత్మజ్ఞానము తప్ప మరేదీ కాదు.



# 2. ప్రేమ - మధువు

సూఫీమత గ్రంథకర్తలు తరచుగా ప్రేమని మత్తు పదార్థమైన సారాయితో పోలుస్తారు. నిజముగా ప్రేమతో పోల్చుటకు సరితూగునది మధువు ఒక్కటే, ఎందు చేతననగా రెండూ ఉన్మత్త పదార్థములే! కానీ మధువు తన స్థితిని మరిపిస్తుంది. ప్రేమ తన స్థితిని గుర్తింపజేస్తుంది.

త్రాగుబోతు, ప్రేమికుడు వీరిరువురి స్వభావములు కూడ ఒకటే. ఇరువురునూ, ప్రాపంచిక, సాంఘిక ప్రమాణాల్ని వ్యతిరేకిస్తారు. లోకంలోని ఇతరుల అభిప్రాయములకు కూడ వ్యతిరేకులే! కానీ వీరిరువురి మధ్య వారి గమ్యము గమ్యస్థానమునకు చేరు ప్రయత్నములలో మాత్రం బ్రహ్మాండమైన అంతరము కలదు. ఒకరు శూన్యము, భయం, కారు చీకటిని కాంక్షించి పయనిస్తే, మరొకరు, స్వేచ్ఛావాయువుల మేరకు విహరించేందుకు అవుసరమగు రెక్కలను తన ఆత్మకు ప్రసాదించును.

ఒక గ్లాసు మధువు త్రాగుబోతుకు కటిక చీకటిని ప్రసాదించును. ఆ గ్లాసు మధువే అతని నిత్యజీవితములోని కష్టములను మరిపించి, నూతన వికాసము కలిగించు ప్రభావము కలిగియుండును. ఒక గ్లాసుతో ప్రారంభించి రెండై, మూడై, సీసా వరకు పెరిగి సాంగత్యము అభివృద్ధియై మితిమీరి, మతిమందగించి నిర్వికల్ప (క్షీణ) దశకు చేరును. ఆధ్యాత్మకంగా నిర్వికల్ప దశ అనగా భగవంతుని సహజస్థితి. ఇట్టి క్షీణ దశ (సర్వము మరచిన)కు చేరిన త్రాగుబోతు మందమతియై ప్రక్కపైనే గాక నీటి ఒడ్డున, దుమ్ములోను కూడ పరుండును. ప్రభావితముగాని వెలుగుతో మేల్కాంచును. లోకుల దృష్టియందు విరాగియై హాశ్యాస్పదమగును.

అట్లు గాక ప్రేమికుని పున్మత్తము భగవంతుని, ఒక అణుప్రమాణమైన ప్రేమతో ప్రారంభమగును. అట్టి ప్రేమను, అతను ఎంత ఆస్వాదించునో, అంత

భగవంతుని సమీపమునకు చేరును. సర్వసుఖములు త్యజించి సర్వము మైమరచి, ఎంత ఎక్కువగా భగవంతుని ప్రేమను ఆరాధించునో, భగవంతుని సన్నిధానమునకు అంత చేరువగును. కోరికలన్నీ త్యజించి, తన శరీరమును ఈషణ్మాత్రముగాయెంచి, భగవంతుని పాదసన్నిధిని చేరే అట్టి ప్రేమోన్మత్తుడు కూడ తాను పరుపుపై పవ్వళించుచున్నాడో మురికి కాల్వ యందు నిదురించుచున్నాడో గ్రహించలేడు. ఇతడు కూడ లోకమున హాశ్యాస్పదుడే, కానీ యీతడు, ఆనంతానందానుభూతిని పొందగలడు. ప్రియతముడైన భగవంతుడే యీతని శరీరమును గురించిన జాగ్రత్తలను తీసుకొనును. పంచ భూతములుగాని, అంటువ్యాధులుగాని ఇతనిని చేరలేవు.

ఇట్టి అనేకమంది ప్రేమోన్మత్తులలో, ఏఒక్కరో గాని భగవంతుని ముఖతా చూడలేరు. అట్టి ప్రేమోన్మత్తుని కోరిక అనంతమై నీటినుండి ఒడ్డున పడి ఎప్పుడు తిరిగి మహా సముద్రమున దుముకుదునా అని కొట్టుమిట్టాడుచేపవలె, భగవత్సాన్నిధ్యము పొందుటకు తహతహలాడును. అతడు భగవంతుని అన్నిటియందు సమస్త ప్రదేశములందు చూడకలుగును. కానీ, భగవత్ స్సాన్నిధ్యము చేరుటకు ద్వారమెరుగడు. తాను అస్వాదించిన మధువనే ప్రేమ అగ్నియై అనంతానందములో ఓలలాడి తానందులో దహించబడును. ఆ అగ్నియే క్రమేణా ఆనందమహాసాగరమై భగవంతునితో సాదృశ్యస్థితిని పొందును.

## 3. ప్రేమ - అంతరములు

కోరికలు నశించినప్పుడు మాత్రమే ప్రేమ బహిర్గతమగును. ప్రేమ నుండి కోరిక జనించును. ప్రేమ యందెన్నడును తృప్తియుండదు. కోరిక దుఃఖహేతువగు వరకు పెరిగి, భగవత్సన్నిధానము పొందిన గాని వదలదు. భగవత్ప్రేమకు

పరాకాష్ట స్థితి కలిగి భగవంతుని యందు లయము పొందినగాని ప్రేమికుడు తృప్తిపొందడు.

ప్రేమాన్వేషణయే త్యాగమార్గము. ప్రేమికుడు త్యజించవలసిన త్యాగము "నేను" అనే ఆలోచన. ఈ "నేను" అనే ఆలోచనను త్యజించిననాడు అట్టి ప్రేమికుడు "హేః భగవాన్! నేను సర్వార్పణ గావించి నీ యందే లీనమైతినిగాన,నాలోనినన్నునశింపజేయుము. కాదేని, నన్నీ విధముగానే వుండమని నీ ఇచ్ఛయైనచో అట్లే కానిమ్మ"ని ప్రాధేయపడును. ఈ విధమైన ప్రేమయే విధేయతను వెల్లడించును.

ఇట్టి స్థితియందు ప్రేమికుడు తన్ను తాను మరిచి, భగవత్ప్రేమాగ్నిలో దగ్ధమై, భగవంతుని ఇచ్ఛకు పాత్రుడై నిరంతరానందమును చవి చూడకలుగునే కాని సాయుజ్యమును కోరడు. నాది, నేను అనే సర్వము త్యజించి, సర్వము సమర్పణ గావించుకొని భగవంతుని యందే లయమగును. ఇట్టి స్థితి, సర్వార్పణ బుద్ధి ప్రేమనావహించినప్పుడు కలుగును.

సకల చరాచర ప్రపంచమందలి కోట్లాది ప్రాణులలో ఒక్కరు మాత్రమే భగవంతుని ప్రేమకు పాత్రులగుదురు. అట్లే కోట్లాది ప్రేమికులలో గూడ ఏ ఒక్కరో మాత్రమే భగవంతునికి విధేయులై జయించి, అమిత విశ్వాసము సర్వార్పణ బుద్ధి కలిగి భగవదనుగ్రహము పొందకలరు.

నేను అవతరించిన భగవంతుడను. నేనే భగవానుడను. నా జీవనయాత్రా సమయమందు జన్మించి నా సమక్షంలో ఉన్న మీరంతా అదృష్టవంతులు. మీ కందరికి నా ఆశీస్సులు.

## 4. ప్రేమ - కానుకలు

ప్రేమ, మానవునికి భగవంతునిచే ప్రసాదింపబడిన నజరానా. విధేయత గురువు మానవునికిచ్చే కానుక సమర్పణ, మానవునిచేత సద్గురువుకు అర్పణ చేసుకున్న కానుక.

ప్రేమించువాడు భగవంతుని ఇచ్ఛను కోరును. విధేయుడు, భగవంతుని ఇచ్ఛను అచరించును. సర్వార్పణ చేయగల్గినవాడు, భగవంతుని ఇచ్ఛ తప్ప మరి ఏదియు గ్రహింపలేడు.

ప్రేమ ఎప్పుడూ భగవత్సాన్నిధ్యమునే కోరును. విధేయత, భగవంతుని ఆనందమును కోరును. సర్వార్పణ మాత్రము కోరునదేదీ లేదు.

నిరంతర ప్రేమ పిపాసి, భగవంతునికి సన్నిహిత ప్రియుడు. అమిత విశ్వాసపాత్రుడైన విధేయుడు, ప్రియతమునికి, ప్రియతముడు కాగలడు. సర్వార్పణ గావించువాడు, ప్రియతముడైన భగవంతుని స్థానమే తప్ప వేరే ఉనికియేదీ లేదు.

విధేయత ప్రేమను మించిన గొప్పది. విధేయత కంటే కూడ గొప్పది సమర్పణ. ఈ మూడును భగవత్ప్రేమ మహాసాగరమందే ఉదయించి, అందే ఓలలాడును.

## 5. స్త్రీ మరియు భగవంతుని ప్రేమ

ఒక పురుషుడు, తాను వలచిన స్త్రీ దూర తీరములందున్నప్పుడు, తానామెను గాఢముగా ప్రేమించును. ఆతనికామె యందున్న ప్రేమ, అతనిని సదా ఆమెను గూర్చియే ఆలోచింపజేయుచు, ఆహార విహారముల యందు అయిష్టత కలిగి, నిద్రాహారములు మానును. అతను ఎల్లప్పుడు, ఆమెతో కలిగిన ఎడబాటును గురించియే ఆలోచించును. సదా ఆమెను కలువవలయుననియే కోరుచుండును. ఈ కోర్కె బలీయమై, దుర్భరమైనప్పుడు, అతడే ఆమె వద్దకు పోవలయును లేదా ఆమెను తన వద్దకు రప్పించుకొనవలయును. ఇట్టి ప్రేమనే "ఇష్కిమిజాజి" లేక భౌతిక ప్రేమ అందురు.

అట్లే భగవంతుని ప్రేమించువాడు కూడ సర్వము త్యజించి, నిద్రాహారములు కూడ మరచి ఎల్లప్పుడు భగవంతునే కోరుతూ, ఆయనకే సర్వసమర్పణ గావించుకుంటే, భగవంతునితో వున్న యెడబాటు అనే అగ్నికి ఆజ్యమై కోరికలునశిస్తే, ప్రియతముడైన భగవంతుడే స్వయముగా ప్రేమికుని చెంతకు అరుదెంచి, భగవదైక్యమనే దాహాన్ని తీర్చగలడు. ఇట్టి ప్రేమనే 'ఇష్కిహిక్కికీ' లేక భగవంతుని వరమందురు.

కానీ ఎవరైతే, భగవత్స్వరూపుడైన సద్గురువును సేవినర్తా విధేయులైయుందురో వారు పై తెలిపిన అనుభూతుల అవసరము లేకుండానే విధేయత అనే సత్య పదార్థ ప్రభావముతో, అట్టి సద్గురువు యొక్క నజరు పొందగలడు.

## 6. పరాయివారంటే భగవంతునికి సిగ్గు

భగవంతుడు సర్వాంతర్యామి. అతని ఉనికి యథార్థము. భగవంతుడు వున్నాడని, నీవు విశ్వసించితే, ఆయన ఉనికిని వెదకుట నీ విధి. ఆయననుగాంచి తరించవలసిన వాడవు నీవే!

భగవంతుని గూర్చి నీలోనే తప్ప, ఇతరత్రా వెదకుటకు ప్రయత్నించకు. భగవంతుని మందిరము నీ హృదయమే కనుక ఆయన నీ యందే కనపడును.

కానీ నీవు ఆయన నివాస స్థానమైన, నీ హృదయ మందిరాన్ని, కోటాను కోట్ల పరాయివారితో నింపివైచుటచేత, ఆయన తన స్థానాన్ని చేరలేకున్నాడు. నీచే నింపబడిన పరాయివారనిన, ఆయనకు బిడియమెక్కువ. ఇన్ని కోట్ల పరదేశులను, ఆయననివాస స్థానము నుండి పారదోలినగాని, భగవత్కటాక్షము నీకు జరుగదు.

ఈ పరాయి వారంతా ఎవరనుకుంటున్నావు? వారంతా నీ జన్మతః

అనాదిగా వున్న కోట్లది కోరికలు. అవి అన్నియు భగవంతునికి పరాయివారితో సమానమే. కారణమేమనగా కోరిక అనునది అసంపూర్తియైన భావము. సర్వసమర్థుడు, నిష్కాముడు, సర్వప్రదాతయైన ఆయనకు కోరిక అనునది ముఖ్యముగా పరదేశమే కాగలదు. ఏలనన భగవంతుడు కోరికల కతీతుడు సర్వసమర్థుడు. నీ ప్రాపంచిక వ్యవహారములందు ఇతరులతో నెరపు కార్యములందు నిజాయితీ వ్యక్తపరచిన అట్టి నిజాయితీ నీలోని పరదేశీయులను బయల్వెడలగొట్టును.

అప్పుడే నీవు ఆయనను కాంచగలవు. ఎరుగగలవు. గుర్తించగలవు.

## 7. సంపూర్ణ నిజాయితీ

సంపూర్ణ నిజాయితీ, సత్యాన్వేషణ లేక భగవదన్వేషణకు అవసరము. ఇట్టి అన్వేషణ యొక్క మార్గము కురులకంటే సున్నితమైయుండును. నిజాయితీ లేని, పొగడ్తలే అలలై అన్వేషణమార్గము నుండి తుడిచివేయును.

అజ్ఞానయుతమైన నీ అహంకారమే నిన్ను నీ నిజమార్గము నుండి దూరము చేయుచున్నది. నిజాయితీ అనే ముసుగులో యీ అహంకారము తనని తాను మోసపుచ్చుకొనుచున్నది. ఉదాహరణకు నేను బాబాను ప్రేమిస్తున్నాను" అని నీవు అనుకుంటే, అదినీ అహంకారమన్నమాట. నీవు నిజముగా బాబాను ప్రేమిస్తుంటే స్వార్థపూరిత భావ ప్రకటన చేసియుండవు. ప్రేమ ప్రవాహములో మునకలువేయుచు, సర్వము మరచుటకు బదులు నేను బాబాను ప్రేమిస్తున్నాననే భావన అనగా ఆత్మలో లేనిదానిని బయటకు నటించి ఆత్మవంచన చేయుటకాదా!

ఈ అజ్ఞానయుత స్వార్థమును విడనాడుట ఎట్లు? నేను, నాది, ఇదంతా నా వల్లనే జరిగినది అనే యీ మాయావరణ స్థితి యొక్క విషపూరిత

బంధమునుండి, దాని ఛాయనుండి బయటపడుట ఎట్లు? సూఫీ మత ప్రవక్త హాఫీజు దానికి జవాబిచ్చాడు. "ఓ ప్రేమికుడా! ఎడబాటు, సంధానము, నీ వ్యాపారము కాదు. సుఖముగా వున్నా, దుఃఖము పొందుచున్ననూ సరే నీవు సంతుష్టుడవు కమ్ము. అది నీకు భగవంతునిచే నిర్దేశించబడినదని గుర్తించి నీవాయన ఇచ్ఛకు వదలి తితీక్షతో వుండుము.

భగవంతుని సాక్షాత్కారము పొందుటకు తాపత్రయపడువానికి ప్రియతముడు అనేక అవరోధాలు కలుగచేయును. అందువలన ఎడబాటు, సంధానము అనే వానిని గూర్చి విచారించకుము. నీవు చేయవలసినది మాత్రము సదా ప్రేమించుటయే! ఎప్పుడైతే నీ గురువుకు నీవు సర్వ సమర్పణ అయ్యెదవో అప్పుడాయన తన కర్తవ్యమును నీ యెడల నిర్వర్తించవలసిన బాధ్యత కలవాడగును. అతడు అట్టి బాధ్యత నుండి తప్పించుకొనడు. ప్రారంభములో నీ మనస్సు ఇతరులకు నేను ఎందుకు విధేయుడుగా వుండాలి? అని తర్కిస్తుంది. దీనికే హాఫీజు తన మనస్సుకు నచ్చచెప్పుతాడు. "ఓ మనస్సా! శాశ్వత స్వేచ్ఛ కావలెనంటే సద్గురువు ఎడ ఇట్టి విధేయతే ముఖ్యము తెలుసా!"

సద్గురువులు ఎంచుకున్నవారు ఆయన యెడల నిజాయితీతో విధేయుడవు కమ్ము. ఎవరైతే నిష్కల్మష బానిస కాగలడో అతడే సద్గురువు కాగలడు.

## 8. ఆపాదమస్తక శూన్యస్థితి

సహజము అనుకరణ అను రెండు రకములు అనుభూతులు కలవు. సహజ వజ్రము, నకిలీ వజ్రములు రెండు వున్నప్పుడు వాటి యందేది సహజమైనదో తెలుసుకొనుట ఎంత కష్టమో, అట్లే ఆధ్యాత్మికానుభూతులందు కూడ యేది సహజమో, ఏది నకిలీయో వివరించుట అంతకష్టము.

ఒకవేళ నిజముగా సహజానుభూతి నీవు పొందినట్లయినచో, ప్రాపంచిక విషయములు నిన్ను ఆశించవు. ఇట్టి సహజ అనుభూతి ఒక పర్యాయము కలిగినచో అది తిరిగి ఎన్నడూ నశించదు. అది శాశ్వతము. ఇట్టి అనుభూతిని పొందుటకు హాఫీజు యీ విధముగా వర్ణించాడు. ఆపాదమశ్తిష్కము శూన్యము అయినగాని అంటే సర్వసమర్పణ అయినగాని ఇట్టి అనుభూతి కలుగదని భావము.

ఆపాదమస్తక రహితము అనగానేమి? నఖశిఖ పర్యంతం శూన్యమను భావము పొంది, సద్గురువునకు సర్వ సమర్పణమగుట. అతని ఆజ్ఞలను శిరసా వహించి ఎదురు ప్రశ్నవేయక, అచంచలమైన విశ్వాసముతో, ఆయన చెప్పినదాని అర్థము తన అజ్ఞానముతో అర్థము చేసుకొన ప్రయత్నించక, ఆయన తనకు చెప్పిన దానిని ఏమి చేయమన్నాడో దానినే చేయవలయును. నీ కదలికలు ఆయన ఆజ్ఞలకు లోబడి నిర్వర్తించవలయును. నీ జీవిత గమనము కూడ ఆయన ప్రేమకు పాత్రమై నడవ వలయును. కావున నీవు నీ గురువునే దైవముగా భావించి, అతని యెడల నీవు ప్రేమ, విశ్వాసములు, సర్వసమర్పణ భావము కలిగి ఎంతగా సేవింతువో అంతగా నీవు సంరక్షింపబడుదువు.

## 9. పయనించని ప్రయాణము

అంతఃపరిణామ విధానంలో జీవుడు పొందే అనుభూతి పరంపరలను ఆధ్యాత్మిక పథమనబడును. ఈ అనుభూతుల పరంపరల ద్వారా పోవుట ప్రయాణమనబడును. ఈ ప్రయాణములో ఒక స్థితియందు మనోజ్ఞమైన కమనీయమైన శబ్దతరంగాలు వీనులవిందగును. మరొకచోట మనోహరమైన, యింతకుముందెన్నడు కనియుండని సుందర దృశ్యములు ఆనందపరచును.

ఇట్టి అనుభూతులు, విభిన్నములు. ఎప్పటికప్పుడు మార్పు చెందును. ప్రయాణము అంతము లేనిది. గమ్యస్థానము అగోచరము. కాని ఆశ్చర్యమేమనగా చివరకు మీరు మీ గమ్యము చేరినప్పుడు మీరు అసలు ప్రయాణమే చేసినట్లు భావన పొందరు. అప్పుడు మీకా ప్రయాణము అడుగు తీసి అడుగు వేసినట్లుండును. సూఫీ ప్రవక్త చెప్పినట్లు ఆత్మ సాక్షాత్కారమనే ఫలము పొందినప్పుడు ఆ ఫలము తనయందే వున్నదని గ్రహించును.

మాయ అనే నిద్రావస్థలో జనన మరణములు, ఆరు భూమికల అనుభూతి, వీటన్నిటితో కూడిన సుదూర, అనంత మార్గములో అంతము లేని ప్రయాణమును, స్వార్థము వీడి నీలోని నిస్వార్థముతో ఐక్యము పొందువరకు చేయును. ఇట్టి ప్రయాణము, ప్రయాణముగా కాక అనంతజ్ఞాన స్వరూపుడైన భగవానుని స్థితి యందు మేల్కొంచి, అట్టి కలలో మేల్కొని భగవంతునికి మనవి చేసుకునే క్షణముతో సమానము. మేల్కొనుట అనగా జాగ్రదవస్తయందున్న భగవంతుని పూర్తినిద్రలో పొందు అనుభూతి. అట్టి నిద్రావస్థలో మేల్కొన్నప్పుడు నీవు యీ సకల చరాచర జగత్తు మాయతో కూడిన కల శూన్యమని గ్రహించి అట్టి మాయను శాశ్వతంగా తుడిచివేయును. స్వర్గము, నరకము, సర్వభూమికలు నీలోనే లీనమై శాశ్వతముగ తుడిచివేయబడితే మిగిలేది శూన్యమని భావము. ఇట్టి జాగ్రదవస్థ స్థితియందు నీలో దాగియుండుటకు ఎట్టి స్వార్థ చింతనకు తావుండదు. అహం నశించును. నీ వునికి శాశ్వతము, అనంతము అగును.

ఇది ఒక్కటే కదిలించి వేయగల అనుభూతిని పొందే దివ్యానుభూతి. ఇట్టి అనుభూతిని సాధించవలెనన్న, నీవు సద్గురువు పాదపీఠమందు,పాద ధూళివై సర్వసమర్పణముగావించు కొనవలయును. నీవు ఎప్పుడైతే సర్వ సమర్పణకు నీ హృదయమును పునీతముగావించు కొందువో, అనిశ్చరముగా శూన్యమగుదువో అప్పుడు మాయాజనిత జీవత్వము నశించి, నీవు సంపూర్ణుడవై సర్వము నీవే అగుదువు.

## 10. అనుమానాస్పద అధిక ప్రసంగి

ఒకప్పుడు, ఒకానొక అనుమానాస్పద అధిక ప్రసంగి, బాయాజిద్ అనే సద్గురువు వద్దకు వెళ్లి యీ విధంగా ప్రశ్నించాడు. "నీవు అన్నియు తెలిసిన సద్గురువు కనుక, ఇతరుల మనస్సులో వున్న ఆలోచనలను నీవు సులభముగా గ్రహించకలిగియుండాలి? కాన యిప్పుడు నేను నా మనస్సులో ఏమి ఆలోచిస్తున్నానో చెప్పమని" కోరాడు. దానికి ఆ బాయజిద్ ఇలా జవాబిచ్చాడు. "ఏమి ఆలోచించకూడదో, దానినే నీవిప్పుడు ఆలోచిస్తున్నావు. ఏది అడుగకూడదో దానినే నీవు అడుగుచున్నావు. నీవు విశాలమైన మనస్సుతో నిష్కామ హృదయముతో, అవాక్కై నా చెంతకు వచ్చియున్నచో, నీవు ఏది పొందుటకర్హుడవో దానిని తప్పక పొందియుండెడివాడవు. ప్రస్తుత నీ స్థితికి సరిపోయిన పైన తెలిపిన చీవాట్లు తినియుండెడివాడవు కావు."

## 11. త్రివిధ స్వల్పానుభూతులు

ఆధ్యాత్మిక ప్రయాణములో ఒకానొక దశలో ఒకరకమైన అనుభూతిని పొందును. ఈ అనుభూతిలో సాధకుడు సమస్త వస్తు సముదాయము తన భౌతిక దృష్టికి నెమ్మదిగా గోచరమవుట మందగించి క్రమంగా అంతరించి, శూన్యమేర్పడును. అది చూచి అతను ఒక్కుమ్మడిగా భయకంపితుడగును. కాని మరుక్షణములోనే ఆ శూన్య శరణమందు ఒక కమలమును గాంచును. ఈ అనుభవమును భరించలేనట్లైతే, కమలము మరుగై, సమస్త వస్తు సముదాయము తిరిగి కనపడుట ప్రారంభించును.

మరియెక అనుభూతి కలదు. ఇది సాధకుని సంపూర్ణముగా తెలివి తప్పించే అద్భుతమైన అనుభూతిని కలిగించును. ఇట్టి అనుభూతి వలన

సమస్తము అతని జాగ్రదవస్త నుండి తుడిచివేయబడును. అది నిర్వికల్ప సమాధి అవస్థ (కోమా). భౌతిక శరీరములో నిశ్చలమైన అచలనమేర్పడి స్పందన కోల్పోయినప్పటికి, శరీర స్థితి మార్పు చెందక, సమాధి అవస్థ సమాప్తమై నిజ స్థితి ఏర్పడే వరకు, శరీర స్థితి నశించక పూర్వ స్థితియందే నిలబడియుండును. ఉదాహరణకు నిర్వికల్ప సమాధి స్థితి పొందుటకు ముందు, ఒక వేళ తన చేయి ఎత్తబడియున్నచో అట్టి సమాధి స్థితి పరిసమాప్త మగు వరకు ఆచేయి అట్లు ఎత్తబడియే యుండును. అట్టి స్థితి క్షణములు గానీ, లేక యెన్ని సంవత్సరములు తరబడియైనను, శరీరమట్లే నిలచియుండును.

ఇంకనూ మరియెక అనుభూతియున్నది. ఇది నాల్గవ భూమికయందున్న వారికి కలుగు అనుభూతి ఇందు అనంతశక్తి ఒకరి చేతియందుండి, అది సాధకునికి అమిత కష్టములు కలుగచేయును. అన్ని కష్టములనధిగమించి నాల్గవ భూమికను దాటినవాడు, భగవంతుని సన్నిధానముచేరి స్వర్గమందిర గడపను ముద్దాడును. హఫీజు చెప్పినట్లు అట్లు ముద్దాడ బోయేముందు అచ్చట (ఆసమాన్) స్వర్గ మందిరము కలదు. అచ్చటనీవు సర్వ శక్తిమయునిగా జీవించుదువు. ఒకవేళ నీవా శక్తిని దుర్వినియోగపరచనిచో అది నిన్ను దుమ్ములోనికి లాగును.

కనుక ఈ ఆధ్యాత్మిక మార్గమందు, మూడు రకముల అతి స్వల్పమైన అనుభూతులు కలవు. మొదటి అనుభూతి వలన భయోత్పాదము కలుగును. రెండవది శరీరచలనము లేకుండా చేయును మూడవది పతనమయ్యే ప్రమాదమున్నది.

సద్గురువు (కుతుచ్) స్పర్శ జ్ఞానానుభవముతో భూమికల నధిరోహించుటకు వీలు కల్గించును. మధ్యేమార్గానుభూతి పొందుచూ భూమికలను దాటుట, సద్గురువుకు చిన్నపిల్లల ఆట వంటిది. కానీ సద్గురువు చిన్న అణుమాత్రమైన దానిని ప్రసాదింపడు. ఆయన ఇచ్ఛయైనచో మహాసముద్రమంత దయను ప్రసాదించును. అట్లే, తన శిష్యులుకూడ, తనకు సమర్పించునప్పుడు, తాను

వారి నుండి సర్వ సమర్పణ, సంపూర్ణ విధేయత, హృదయపూర్వక ప్రేమ మాత్రమే కాంక్షించును. ఎప్పుడైతే తన శిష్యుడు వీటినాచరించునో అప్పుడు ఒక్క తృటిలో ఆయన తన శిష్యుని అత్యున్నత స్థితికి చేర్చును. అట్టి ఉచ్ఛస్థితియే నేను భగవంతుడను అనే అనంత జ్ఞానానందానుభూతి.

## 12. త్రివిధ వర్గాలు

**శిష్యులు :-**

వీరు మూడు రకములు 1) ఇతరులకు యివ్వక యాచించువారు. 2) ఇతరులకు ఇచ్చి యాచించువారు 3) ఇతరులకు ఇచ్చుటయేగాని ఎన్నడూ యాచించనివారు.

**అన్వేషకులు :**

1. జ్ఞానోపాసాన్వేషకులు. 2. ఆలోచనా పరులైన జ్ఞానాన్వేషకులు, 3. గొప్ప ఆలోచనలు గల అన్వేషకులు.

**యోగులు :-**

దివ్యశక్తులు సాధించుటకు యోగవిద్యలనభ్యశించువారు. దివ్య శక్తుల సాధనకు, భగవత్సన్ని ధానము చేరుటకు యోగ్యమైనవారు. భగవత్సన్ని ధానము చేరుట యేధ్యేయముగా మరెట్టి దివ్య శక్తులు కావలెననే కోరికలేనివారు.

**ప్రేమికులు :-**

సత్య పదార్థమైన భగవంతుని సదా ప్రేమిస్తూ ఆయనను మాత్రమే ఎరిగిన ప్రేమోన్మత్తుడు, తన సర్వస్వము త్యజించి, శరీర స్పర్శ జ్ఞానాన్ని సైతం విడనాడి, పరిసరములు వదలి, భౌతికంగా ప్రపంచమునకు, తనకు కూడ మరణించిన వాడగును. అట్టి వానికి మాత్రమే భగవంతుని ఉనికి ద్యోతకమగును. భగపంతుడతని వెనకేవున్నాడు.

ఎవరైతే ప్రాపంచిక సుఖములననుభవిస్తూ జీవించునో, వారు నూటికి

నూరుపాళ్లు తన ప్రాపంచిక విధులను, బాధ్యతలను, తు.చ. తప్పకుండ ఆచరించును. అట్టి సమయమందు సమస్తము భగవదిచ్ఛ వలన జరుగుచున్నదను భావన ఆతనికి జ్ఞప్తియందుండును. ఇతరులు ఎరుగని విధానముగా అతడు భగవంతుని ప్రేమించును.

అవతారునికి సర్వ సమర్పణ చేసుకొనువారు ఒకరు. అతను తనకొరకెన్నడు జీవించడు. అవతారుని కొరకు మాత్రమే జీవించును. ఇది అత్యున్నతమైన చాలా అరుదైన ప్రేమికుని రకము.

వైరాగ్యులు :

సద్గురువు ఆశించిన దానిని వీరు తప్పక ఆచరిస్తారు కానీ వీరు ప్రతిఫలముకై ఎదురుచూచెదరు.

తన సద్గురువు కోరిన దానిని ఆచరించుచు తన సర్వస్వమును ఎట్టి ప్రతిఫలము కోరక పరిత్యజించువారు, వారు అట్లు ఎందువలన చేయుదురనగా, సద్గురువు యెడల చూపే సమర్పణ భావమే వారినట్లు చేయించును.

తాను సమర్పణ గావించు కొనుచున్నాను అనే భావనలేకయే, తన సద్గురువు యొక్క ఇచ్ఛకు దాసుడై సర్వ సమర్పణగావించుకొని, ఎవరు, ఎందుకు, ఎప్పుడు, ఏమిటి అను ప్రశ్నలకు తావీయక, సద్గురువు చెప్పినది చేసితీరును. ఇట్టివారే అదృష్టవంతులైన బానిసలని హాఫీజు శలవిచ్చి యున్నాడు. సద్గురువైన హాఫీజు మహాశయుడు మనలనందరను కూడ యీ విధమైన శిష్యులు కమ్మని సలహాయిచ్చియున్నాడు.

"అదృష్టవంతుడైన బానిసగా వుండవలెనన్నచో,
సద్గురువు ఆజ్ఞలకు యధాతధంగా ఎందుకు
ఏమిటని ప్రశ్నించక అనుకరించుము"-

- హాఫీజు

# 13. అన్వేషించకు - నీవు కాంచెదవు

"వెదకినచో నీవు కాంచెదవు" అనే సర్వసామాన్యమైన భావన ఆధ్యాత్మిక సాధకులకు గ్రహించనాశ్చర్యపరచును. ఎందువల్లననగా మీరు నన్ను కాంచగలరు, వెతకండని నేనే వారికి తెలిపెదను.

భౌతికానందము కొరకు మీరు అన్వేషించనిచో మీరు ఆధ్యాత్మిక సంపదను పొందగలరు. అనగా భగవంతుని మాత్రమే అన్వేషించుడు. ప్రాపంచిక సుఖముల కొరకు తాపత్రయపడుకుడు. అప్పుడు మీరు సాక్షాత్తు పరమేశ్వరుని చూడగలరు.

నీవు స్వార్థరహితుడవైతేనే కాని, నిస్వార్థ స్థితియందు భగవంతుని వెదకగలవు. కేవలము నీ చేయి జాపినంత మాత్రము చేత, ఆధ్యాత్మిక సంపద నీకందదు. అహంకార రహితమైన నిస్వార్థ స్థితియందు మాత్రమే, ఆధ్యాత్మిక సంపద, సాక్షీభూతము కాగలదు.

ఆధ్యాత్మిక సంపదను పొందుటకు మూడు మార్గములున్నవి.

స్వయంకృత తిరస్కార భావముతో, ఆధ్యాత్మిక సంపదను పొందుట మొదటిది.

అహంకార రహితమై స్వార్థము తుడిచివేయబడి, ప్రియతముని చేరుటకు తహ తహలాడు ప్రేమికునికి, అనాచితముగనే భగవంతునిచే ప్రసాదించబడునది రెండవది.

సర్వ సమర్పణముగావించిన పిదప సద్గురువు ద్వారా అయన ఇచ్చుకు పాత్రుడై పొందుట మూడవది.

అందువలన, నీవు అట్టి సంపదను పొందవలెనని కాంక్షించిచో భౌతికానందమునిచ్చే ప్రాపంచిక సుఖములు పొందుటకై అన్వేషణ మానుము. భౌతిక రాజ్యాన్ని వదలి, స్వర్గ సామ్రాజ్యాన్ని పొందుటకు అన్వేషించు. నీవు తప్పక దానిని పొందగలవు.

## 14. భగవంతుడు అన్వేషించును

దైవీ ప్రేమ అనే యీ ఆటలో ముఖ్యముగా గ్రహించవలసిన అంశము అన్వేషించువాడు, అన్వేషించబడువాడు రెండునూ ఆయనయే. ఆయననెట్లు వెతకవలయునో, ఎక్కడ వెదకవలయునో, అసలు ఎవరిని వెదకవలయునో యీ విధమైన ప్రశ్న పరంపరలను తానే ప్రేమికుని (అన్వేషకుని) నోట పలికించునట్లు చేయును. అన్వేషకుడు అడుగుచున్నాడు. భగవంతుడు ఎక్కడ వున్నాడు? భగవంతుడునూ నిజముగానే పలుకుచున్నాడు, అన్వేషకుడు నిజముగా ఎక్కడ వున్నాడు ?

## 15. ముత్యాలకై మునిగేవాడు

"నేను ప్రేమికునిగా మారినప్పుడు నా గమ్యమనే ముత్యాన్ని పొందానని భావించాను. కానీ, అజ్ఞానము వలన, ఆ ముత్యము సముద్ర గర్భములో అట్టడుగున వున్న నేలపై వున్నదన్న విషయము తెలుసుకోలేకపోతిని. అట్టి వజ్రము పొందుటకు చేరవలయునన్న అగాధమైన మహాసాగరమును, తాళ ప్రమాణమైన బ్రహ్మాండమైన అలల తాకిడికి తట్టుకొని అధిగమించవలెను గదా !" - హాఫీజు

ప్రారంభమందు సత్యాన్వేషకులు, సామాన్య మానవులుగా, మహా సముద్రపు అట్టడుగున నున్న అమూల్యమైన ముత్యమును పొందుటకు, సముద్రపు ఒడ్డుకు చేరి, తొలుదొలుత, బ్రహ్మాండమైన అనంత మహాసాగరాన్ని చూచి, ఆశ్చర్యపడును. తరువాత నీటిలో నడచుట ప్రారంభించును. అలల తాకిడికి

ఒడ్డుకు దాపులో వచ్చి పడు శబ్దమునకు వున్మత్తుడై వచ్చిన పని మరచి వజ్రాన్వేషణ మానును.

ఇలా అన్వేషణ ప్రారంభించిన అనేకులలో ఏ ఒక్కడో గాని, తన తృష్ణ జ్ఞప్తియందుంచుకొని తాను దానిని పొందుటకై సముద్ర గర్భము చేరుటకు కావలసిన యీతను నేర్చుకొనుట ప్రారంభించును.

ఇలా ఈత నేర్చుకొనుట ప్రారంభించిన అనేకమందిలో గజ ఈతగాడైన ఒక్కడు మాత్రమే మహా సాగర గర్భము చొచ్చుకొనిపోగలడు. మిగిలిన వారంతా సాగర గర్భములో నశించవలసినవారే !

ఇలాంటి గజ ఈతగాళ్లు అనేకమంది సాగరగర్భం చేరినప్పటికి ఒక్కరు మాత్రమే ముత్యాన్ని అన్వేషించెదరు. తక్కినవారు సముద్రపు అడుగుకు చేరిన ఆనందములో ముత్యము విషయము మరచెదరు.

ఇలా ముత్యాన్ని అన్వేషించే అనేకమంది సాధకులలో ఒక్కడు మాత్రమే సాగరగర్భమందలి ముత్యాన్ని పొందగలడు. ఇలా ముత్యాన్ని పొందిన అనేకమందిలో ఒక్కడు మాత్రమే వెనుకకు మరలి తిరిగి ఒడ్డు చేరుటకు ఈదగలడు. తక్కినవారు అట్టి వ త్యాన్ని చూచినప్పుడు పొందిన అనుభూతికి చకితులై, సాగరగర్భంలో నేలపై పడియుందురు.

ఇలా ఉపరితలముకు ఈదుచున్న అనేకమందిలో ఒక్కడు మాత్రమే ఒడ్డు చేరగలడు. ఆ ఒక్కడే సద్గురువు (కుతుబ్) అప్పుడాయన తన ముత్యాన్ని యితరులకు చూపగలడు. అట్టి ఇతరులెవరో కారు. వారే సముద్రమట్టంలో అట్టడుగున వెతకగలవారు, యీదగలవారు, ఒడ్డున నడువగల్గువారు, వీరందరిని ఉత్సాహపరచి, వారు చేయు కృషికి ప్రోత్సాహపరచును. అప్పుడాయన తాను ఇచ్ఛగించినచో ఈదుట మున్నగునవి నేర్చుకొనకుండగనే అట్టి ముత్యమును తన స్వంతము చేయగల శక్తిమంతుడగును.

కానీ దైవీమానవుడు లేదా అవతారుడు ఇట్టి గురువులకు గురువు. (కుతుబ్-ఆర్-అక్తబ్) ఆయన ఇలాంటి వజ్రములు అమూల్యమైనవి, లెక్కలేనన్ని యివ్వగలడు. సద్గురువు సర్వాంతర్యామి యొక్క కృపచే ఆవరింపబడిన

సంపూర్ణ గురువు. ఆయన యొక్క శక్తి వలన తన కార్యములు చేయును. కానీ అవతారుడు అవధులు లేని లయకారకుడు. ఆయన సర్వశక్తివంతుడు. సర్వోత్తముడు. అగాధసాగరుడు. సద్గురువు యొక్క శక్తి కూడ అద్వితీయమైనదే. అవతారుడు, సద్గురువు ఇరువులలోనూ ఒకే రకమైన శక్తులు కలిగియుందురు. కాని వారి మధ్య అద్వితీయ శక్తుల భేదము అవి పనిచేసే తీరులో మాత్రమే వున్నది. సద్గురువు శక్తులు కొన్ని పరిధిలులో మాత్రమే వుండును. అవతారుని శక్తులు అవధులు లేనివి.

## 16. చతుర్విధ ప్రయాణములు

భగవంతుడు అనంతుడు. ఆయన నీడయు అనంతమే. అట్టి భగవంతుని ఛాయ ఈ సకల చరాచర ప్రపంచమును ఆవహించియున్నది. అది మానవుని బాహ్య దృష్టిని, అంతర్‌దృష్టిని కూడ ఆవహించినది. కోటాను కోట్ల విశ్వాంతరాళాలను సృష్టించుచున్నది. ఈ సకల సృష్టికి కారణభూతమా ఛాయయే. భగవంతుని అనంతమైన ఉనికి యొక్క ఆధ్యంతరహిత బిందువునుండి సృష్టింపబడిన ఛాయయే అది.

ఈ కోట్లాది విశ్వాంతరాళాలలో అనేక గ్రహాలు వున్నవి. కొన్ని వాయువులతో కూడినవి. కొన్ని ద్రవ భూయిష్టమైనవి. మరికొన్ని రాళ్లు లోహములు కలిగినవి. మరికొన్ని చెట్లు చేమలు కలవి, కొన్ని క్రిమికీటకములు కలవి, కొన్నిమత్యములు కలవి, కొన్నిపక్ష్యాదులు కలవి, మరికొన్ని జంతుజాలములుకలవి, ఇంకా మరికొన్ని మానవ జీవనము కలవి ఉన్నాయి.

ఇన్ని రకములైన అనేక కోట్ల విశ్వాలలో, సృష్టి, స్థితి, లయకారకమైన సప్త రాజ్యాలు గల గ్రహములున్నవి. స్పర్శ, జ్ఞానము, ధారణ మున్నగు అవతరణ చైతన్య పరిణామము ఈ గ్రహములందే జరుగును.

కానీ యీ భూగ్రహమందే జనన మరణములు తిరిగి తిరిగి జరుగుచూ, ఆత్మ జ్ఞానానుభవము పొందుటకు ముక్తి మార్గముననుసరింతురు.

అనంతాకాశమందలి కోట్లాది విశ్వాంతరాళాలకు మన భూమి కేంద్రస్థానము. ఈ భూమి కేంద్రస్థానమగుట వలన ఇతర గోళాలలో వున్న జీవాలన్నీ, ఆధ్యాత్మిక పథంలో ముక్తి మార్గమనుసరించుటకై ఈ భూమిపైకి వలసవచ్చును.

ఈ ముక్తి పథంలో ఏడు విరామ స్థానములున్నవి. అందు ఏడవ విరామస్థానమునకు చేరుట అనగా భగవంతుని వద్దకు చేయు మొదటి ప్రయాణము పూర్తియైనదన్నమాట.

ఈ ప్రయాణము ముగింపే, మానవాత్మలకు గమ్యమైనప్పటికీ, సాధారణంగా కొన్ని మాత్రమే ఏ క్షణములోనైనా దానిని చేరగలవు. ఈ ప్రయాణము సంపూర్తి చేయటమంటే అజ్ఞానాంధకారము, అహంకారము శాశ్వతముగా అనంత మహాసాగరములో తుడిచివేయబడి విజ్ఞానవంతమగుట. ఆత్మచైతన్యవంతమై అనంతమైన అవిభాజ్యమైన ఏకత్వమందు లీనమై అఖండ జ్ఞానానుభూతి పొందును. తానే భగవంతుడిగా, అనంతజ్ఞాన సంపన్నుడిగా, అనంతశక్తిమంతుడిగా, అనంత ఆనందమయుడిగా అనుభూతి పొందును.

ప్రప్రథమయానము పూర్తిచేసిన ఆత్మలన్నిటిలోను కొద్ది ఆత్మలు మాత్రము ద్వితీయయానములో ప్రవేశించును. యీ ప్రయాణమునందు విశ్రాంతి స్థానములు లేవు. ఇది ప్రారంభించగానే పూర్తిచేసే ప్రయాణము - సంకల్పరాహిత్య స్థితితో కూడిన యీ ప్రయాణము కుదిపివేయబడి తానే భగవంతుడు అను స్థితికి చేర్చును. ఈ స్థితియందు తన సహజ స్థితిని తిరిగి పొందును. అట్టి సహజ స్థితి అనంతమైయుండును. ఈ అనంతస్వరూపము స్థూల జ్ఞానానుభవముతో కూడియుండును. కనుక ఇట్టి స్థితియందు మానవునిగా, దైవముగా కూడ అనంతశక్తి, అనంత ఆనందము, అనంత జ్ఞానానుభూతులు పొందును. అదే ఆద్యంతరహితస్థితి. అవధులు లేని అనంత, ఆత్మ అప్పుడు సూక్ష్మస్థితియందలి తన అనంత స్వరూపాన్ని గ్రహించకలుగును.

ద్వితీయయానము పూర్తి చేసినవారు తృతీయయానమారంభింతురు. మానవునిగా, దైవముగా జీవనయాత్ర చేయు సర్వశక్తిమయులు, అట్టి దైవ జీవనము కొనసాగించుచూ, అనంతశక్తి, జ్ఞాన, ఆనందముల అనుభూతులను నిర్వహించు బాధ్యతలను కూడ వహించును.

సర్వకాలసర్వావస్థల యందు ఈ భౌతిక ప్రపంచంలో అట్టి సద్గురువులు ఐదుగురు మాత్రము ఉందురు. వారు భూప్రపంచమందలి మానవుల ప్రాపంచిక వ్యవహారములనరికట్టి విశ్వముల గమనాన్నరికట్టగలరు. ఈ పంచ సద్గురువులలో ఏ ఒక్కరో తమ దివ్య శరీరాన్ని వదలినప్పుడు పైన చెప్పిన మానవునిగా దైవముగాను జీవయాత్ర సాగించువారిలో ఒకరు ఆ స్థానమునాక్రమించి మూడవయానము పూర్తిచేయును.

ఈ పంచ సద్గురువులు, సనాతనుడైన అవతారుని, అవతరణకై కృషి చేసి, అవతరింపచేసి ఆయనచే సృష్టింపబడిన బాధ్యతలను ఆయనకే తిరగి వప్పగింతురు. ఈ భూమిపై దైవ జీవితాన్ని నెఱపే ప్రతివారు, ఈ భూమిపై దైవమందు దైవముగా విశ్వసించబడే ప్రతివారు, వారు తమ భౌతిక శరీరమును వదలినప్పుడు, అన్నమయ, మనోమయ దేహములను కూడా శాశ్వతముగా వదలివేసి, భగవంతునిగా వెళ్లిపోవుదురు. తన అనంతమైన సహజ స్థితిని మాత్రము కోల్పోరు. అనంతశక్తి, జ్ఞాన, ఆనందములు అనుభవించుదురు. యిదే చతుర్థయానము.

నిజానికి ఈ నాలుగూ ప్రయాణములు కానేకావు. భగవంతునిగా ప్రయాణము చేయుటకు ప్రదేశమే లేదు కదా! ఆయన ఆద్యంతరహితుడు. మనకు దృగ్గోచరమయ్యే ప్రతి పదార్థము. ఆయన నుండియే కనపడును. ఆది లేని స్థానము నుండి ప్రతిఫలించి, అంతము లేని దానియందు లీనమవుచున్నది.

# నాలుగు యాత్రలు
# THE FOUR JOURNEYS



## 17. మధువ్యాపారి

సూఫీ కవులు, ప్రేమ మార్గము, ప్రేమికుని స్థితి, వీటిని వర్ణించుటకు సాధారణముగా మధువుతో పోల్చుదురు. మైఖానా అనే సారాయి దుకాణమొకటి కలదు సాఖియనువాడు మధువ్యాపారి. రింద్ అతని ఖాతాదారు. సఖివుల్ఇర్షద్ సారాయి తయారుచేసి గుత్త వ్యాపారము చేయువాడు. సారాయి అమ్మకందార్లకు హోల్‌సేలుగా అమ్ము వ్యాపారి.

ప్రపంచములో అనేక రకములైన సారాయి దుకాణములున్నవి. నూతనముగా పెట్టినవి, కల్తీ సరుకు అమ్మునవి, చౌకగా అమ్మునవి, అట్టిది సేవించిన శారీరక, మానసిక దుర్బలత్వము ఏర్పరుచునవి ఇన్ని రకములగు దుకాణములున్నవి. అట్లే ఆధ్యాత్మికపథమందు కూడ అతితక్కువ సాధనతో సఖీవుల్‌షద్‌లనుండి సంపాదించిన ప్రేమ అనే మధువును అందించగల సఖీలు అనేకమంది అతిస్వల్ప అనుభూతులతో ప్రసాదించగలవారున్నారు. అట్టి అనుభూతులకు నూతన వుత్తేజములుకలిగించి, తక్కువ వెలకు ఇతరులకు అమ్మ కలిగినవారున్నారు.

అతిమంచి ద్రాక్ష సారాయములుమధుపాన సేవకుల కొరకు నిలువయుంచు సారాయి షాపులనేకమున్నవి. అట్లే వల్లీలు పీరులనబడు సాఖీల వంటి సద్గురువులు కూడ భగవదర్పణ కొరకు పరిపక్వమైన ప్రేమను కూడబెట్టి భగవదర్పణ కొరకు నిలువయుంచుదురు. దానిని పొందుటకు వారు వెచ్చించిన విలువ తనకు ఆత్మీయము, ప్రియమైన సమస్తము త్యజించుటవల్ల తిరిగి అట్టి విలువను తాము ఎవరి కొరకు త్యజించెనో వారి నుండి పొందెదరు.

ఇట్టి విలువలను వెచ్చించు అనేకమంది సాఖీలనబడు వల్లీలు లేక పీరులనే సద్గురువులలో అరుదుగా ఏ ఒక్కరో గాని సాఖీవుల్ఇర్షద్‌చే తన దుకాణము సందర్శించవలసినదిగా కోరబడరు. అట్లు ఆహ్వానింపబడిన

పిమ్మట ఆయనకు ప్రత్యేక సీసాలో భద్రపరుపబడిన మధువు ప్రేమను ఒకచిన్న గ్లాసుడు అందించగానే దానిని సేవించినప్పుడు దాని ప్రభావము వలన అతడు మైమరచి భగవంతునిలో లీనమగుట ప్రారంభించును. ఈ విధంగా ఇట్టి సాఖీవుల్ఇర్షదులు, తన్నాశ్రయించిన సన్నిహితులలో ఒక్కనిని మాత్రమే తన అంతటివానిగా అనగా సఖీవుల్షదుగా తయారుచేయును.

ఈ సాఖీవుల్ఇర్షద్ కుతుబ్ స్థితి ప్రజ్ఞుడు. సర్వజ్ఞుడు లేక సద్గురువు అందురు. ఈ విశ్వమునకు సూత్రధారి, రధసారధి కూడ ఆ సద్గురువే. అతడు సర్వశక్తిమయుడు. అతని ఇచ్ఛ వచ్చినట్లుపయోగించు అధికారము కలవాడు. అతడుఎప్పుడూ భగవంతుని ముఖతఃకాంచుటకు మత్తునుకలుగచేయక అవసరమగు దృష్టిని ప్రసాదించును. మరికొందరిని భగవంతునితో ఏకత్వముపొందునట్లనుగ్రహించును.

హాఫీజు మహాశయుడు చెప్పినట్లు :-

"సఖీవుల్ఇర్షద్ అయినవారు, సిద్ధపురుషులు తమ క్రీగంటి చూపు చేతకాని, దర్శనమాత్రము చేతకాని, సంకల్పమాత్రము చేతకాని, ధూళిని, పాషాణముగాను, పాషాణమును విలువ గల బంగారముగానుమార్చగలరు.

ఒక్కొక్కప్పుడు తన గత జన్మలలో అట్టి సఖీవుల్ ఇర్షద్ను గాఢముగా సేవించి యీ ప్రస్తుత జన్మలో కారుచౌకగా స్వల్ప విలువలో లభ్యమౌ మధువు ప్రేమ కూడ పొందలేని స్థితిలో వున్నవానిని, సద్గురువు గుర్తించి, అట్టివానినాహ్వానించి చిన్ని గ్లాసుడు మధువు నందించి, సేవింపచేసి, ఆత్మ సాక్షాత్కారము కలుగచేయును. అనగా అతనిని కూడ సాఖీవుల్ ఇర్షద్ (సద్గురువు) గా మార్చును.

# 18. అనంతవ్యాపియైనవాడే సద్గురువు

కబీరు యీ విధంగా పలికెను :-

"కర్ణబోధలు చేయు గురువు పరిమితమైన పరిధులు కలవాడు మాత్రమే గాని, అనంతవ్యాపి కానేరడు. అనంతవ్యాపియైనవాడు సద్గురువు మాత్రమే. ఇది మాత్రం మనస్సులో గుర్తించాలి."

కర్ణబోధలు చేయు గురువులని కబీరు పలికిన పలుకులుప్రకారం అట్టివారు 5వ భూమికలో వున్న గురువులు కానీ ఆరవ భూమికయందలి గురువులు కూడ ఇందు చేర్చవచ్చును. కారణమేమన ఇరువురునూ పరిమితమైన జ్ఞాన భూమికలందే వుందురు.

సర్వకాలములందు మనము ప్రపంచములో మూడు రకముల గురువులను చూచెదము.

1. తనవద్ద ఎట్టి శక్తి లేకున్నను వున్నట్లు నటించు మోసగాడు మొదటి రకము.

2. శక్తిమయుడైనను, పరిమితశక్తి కలవాడు - అయిదవ భూమిక యందలి వలి లేక గురువు. 6వ భూమికయందలి గురువు లేక పీరు రెండవరకము.

3. భగవత్సాక్షాత్కారము పొందిన సద్గురువు 3వ రకం.

వలీ ఎవరిచేతనైననూ ఆనందింప చేయబడినప్పుడు, అట్టివాని చెవియందు ఒక్క దైవమాటను రహస్యముగా వుపదేశించును. అతని కన్నులయందు తీక్షణముగా చూచి, అతని ఆత్మ జ్ఞానమునకుపకరించును. అట్టి శక్తిని పొందిన వ్యక్తి తనతోటి వారల మనస్తత్వములను, తాను కోరినచో వ్యక్తపరచగలడు. వెలుతురులో రంగులను మరొక్కప్పుడు వెలుతురులో వలీ ముఖమునే కాంచగలడు.

వలీ అట్టివానిని తన చైతన్యస్థాయికి తెచ్చి, పొందిన ఆత్మజ్ఞానానుభవముతో

తనకు తాను మానశిక శరీరాన్ని చూడకలిగి తన స్థూల శరీరము, భౌతిక శరీరములను ఉడుపుల వలె మాత్రమే ధరించితినని గ్రహించునట్లు చేయును. సుషుప్త అవస్థ నుండి జాగ్రదవస్థకు ఒకనిని తెచ్చుట సామాన్యము కాదు. అది సద్గురువుకు మాత్రమే శక్యము. మనస్సు సంకల్ప రాహిత్య స్థితిని సాధించునప్పుడు కాషాయ స్థితినిపొంది, సుషుప్తావస్థకు వచ్చును. పరిమిత జ్ఞాన భూమికయందున్న స్థితిలో అత్యున్నత శ్రేణిలో అనుభవం పొందుట కూడ మాయావరణంలో పొందు దృశ్య భాగమే. పూర్వవాసనల నుండి క్రొత్త దృక్కోణమునకు దృష్టి కేవలం మరల్చును. ఇట్టి దృష్టి అనల్పమైననూఅతను ఇంకా దేవునికి వెన్ను చూపి, మాయనే చూస్తాడు.

పీరు అట్లు వలీవలే ఏ పద్ధతిని కూడ వుపయోగించడు. అతను ఎవరిచేతనైననూ, సంతోషపెట్టబడినచో ఆతనికి ఒక గ్లాసు నీరు గాని, కప్పు తేనీరు గాని ఇవ్వమని కోరి, అందులో రెండు గుక్కలు పానీయమాయన సేవించి, మిగిలినది త్రాగమని ఇచ్చును. లేక చేతిరుమాలు గాని, గుడ్డపీలిక గాని ఇమ్మని కోరి, దానిని కొంచెము సేపు తానుపయోగించి తిరిగివాడు కొమ్మని వానికిచ్చును. అతిస్వల్పచర్యల ద్వారా ఎట్టి స్థితిలో వున్న వ్యక్తినైనా ఉచ్ఛ స్థితికి చేర్చి, మాయావరణము నుండి మరల్చి, వర్ణించనలవి కాని భగవద్దర్శనము పొందునట్లను గ్రహించును.

తమ జీవితములో వలీ గాని, పీరు గాని తమ స్థితి వరకు ఒక్కరు లేక ఇద్దరు జీవులను మాత్రమే తీసుకురాగలరు. పీరు ఆరవ భూమికను దాటి ఆ పైకి ఎవరిని చేర్చలేడు. కారణమేమనగా ఆరవ భూమికకు పరిమితమైన శక్తులు ఉండును. ఆరు, ఏడు జ్ఞాన భూమికల మధ్య బ్రహ్మాండమైన అగాధమును దాటవలయును - అనగా ఇదే చేరవలసిన గమ్యము. అదే చివరి కేంద్రమైన పరిమిత జ్ఞాన భూమికకు, అనంతమైన అపరిమిత గమ్యమునకు మధ్య గల బేధము.

ఒక పీరు ద్వంద్వ రాజ్యములో అభిషిక్తుడైయుండును. కనుక ఏ ఒక్కరిని

అపరిమిత జ్ఞానానంద భూమికలకు చేర్చలేడు. ఒక సద్గురువు అవధులు లేని అపరిమితుడు గాన, పీరు వలె గాక ఒకరిని తను ఇచ్ఛగించినచో ఏ భూమికకైన చేర్చగలడు. ఆయన అనంతమార్గములను ఉపయోగించి (భౌతికంగా స్పృశించుట లేక ఆశీర్వాదమాత్రము) తాను కోరినవారిపై తన కృపను ప్రసరింపచేయును. ద్వంద్వ ప్రభావము నుండి భగవత్సాక్షాత్కారము పొందునట్లనుగ్రహించును.

వలీ గాని, పీరు గానీ, ఎవరికైన ఒక జ్ఞాన భూమిక నుండి వేరొక భూమికకు పెంచవలయునన్న అట్టివారు స్వయముగా వారి సమక్షమందుండవలయును. కానీ, కాలమాన పరిస్థితులెంత మాత్రము, సద్గురువునకు తన కృపను ఎవరికైననూ ప్రసాదించదలచినచో అడ్డురావు. అట్టి వ్యక్తి వేలకొలది మైళ్ల దూరమందున్ననూ లేక భౌతిక శరీరమందు లేకున్ననూ కూడ ఆయన కృపను అందివ్వగలడు. సద్గురువు యొక్క తలంపు ఎంత శక్తివంతమైనదనగా అది ఆయన కోరిన వ్యక్తిని ఆ మరుక్షణమందే అపరిమిత జ్ఞానానంద సప్తమ భూమికకు చేర్చగలడు.

మరి యీ భూమికల గోళములు ఎక్కడ వున్నవి? అవి అన్నియు నీ యందే వున్నవి. అవి వున్నవన్న భావన నీకు కలుగుట లేదు. ఏలనన వివిధములైన జ్ఞానస్థితులు వివిధములైన జ్ఞానానుభూతుల స్థాయిలను కలుగుచేయుచున్నవి. ఉదాహరణకు ప్రథమ భూమికగా ఒక చీమను తీసుకొనుడు. ఒక శునకము మూడవ భూమికగా ఏనుగును ఐదవ భూమికగా మానవుని జ్ఞాన భూమికయైన సప్తమ భూమికగా తీసుకొనుడు. ఈ చీమ, శునకము, ఏనుగు మరియు మానవుడు కూడ ఒకే భూమిపైసంచరింతురు. కాని వారి జ్ఞాన శక్తుల మధ్య మాత్రం బ్రహ్మాండమైన అంతరము కలదు. పరిమితము, అపరిమితములు నీయందే యున్నవి. బహుశః అవన్నీ నీవే. కానీ నీవు వాటి అనుభవము పొందుట లేదు. అందువలననే "నేను" అనే సహజ పదార్థము మరుగై అహంకారమగు "నేను" బయల్వెడలుచున్నది.

ఈ భూమియందలి మహోన్నతములన్నియు జ్ఞాన భూమికల పరిమితమందే

యున్నది. ఒక పీరు, భగవంతుని చూచునట్లనుగ్రహించగలడు. అయినప్పటికి అతని వాస్తవ స్థితికి అవాస్తవము ఇంకా కలిసియేయుండును. సరియైన క్షణములో ఒక సద్గురువు నీలోని అసత్య పదార్థము సమస్తమును తుడిచివేయును. ఆయన అది ఎట్లు చేయగలడు? ఇది తిరుగులేనిది. ఎవరైతే కేవలము జ్ఞానమే తానగునో ఆయనయే యిది చేయగలడు. ఎప్పుడైతే అవాస్తవము రాలిపోవునో అప్పుడు సహజమైన ప్రత్యేకత ప్రతిష్టింపబడును. ఇదే "నేనే భగవంతుడను" అను స్థితి.

పరిమిత స్థానపు అవధులు దాటి, అనంత అపరిమిత స్థానమేర్పరుచుటకు ఏకైక మార్గము సద్గురువు ఎడల ప్రేమాంబుధిలో ధూళిగా మారి సర్వసమర్పణ చేసుకొనుట మాత్రమే. అందుకనే సద్గురువులలో ఒకరైన తుకారాం యీ విధంగా అన్నాడు.

"సద్గురువు కృప లేనిదే, నీవు నీ గమ్యము చేరుటకు తరుణోపాయ మెరగలేవు.

అన్నిటి కంటే ముందు సర్వోత్తముడైన ఆయన పాదపద్మములను వీడక నారాధింపుము".

- తుకారాం.

## 19. భగవంతుని నటన

ఏసు ప్రభువు, క్రీస్తు చైతన్యస్థితి యందుండును. దీనియర్థము జీసను తానే క్రీస్తుననే భావన కలిగియుండుట. జీసను క్రీస్తు జూదుల మధ్యనున్నాడు. వారిమధ్య నున్నప్పుడు తనను వారు వ్యతిరేకించి తిరస్కరిస్తారని ఆయన ఎరుగును. అయినప్పటికి ఆయన ఏమియు ఎరుగనట్లు వారి మధ్యనే మిన్నకుండును.

సర్వమూ తెలిసియు, తెలియనట్లు నటించుట ఆయన లీల యొక్క ముఖ్యోద్దేశము. శాశ్వత క్రీస్తు అవస్థ యొక్క దైవ జ్ఞానానుభూతి ఇదియే!



## 20. ఒక దురవస్థ

ఆత్మ జ్ఞానమనగా సమస్త గ్రాహ్యము కలిగిన జ్ఞానమే ఆత్మ జ్ఞానము. జ్ఞానము ఆత్మ యొక్క సమస్త జ్ఞానానుభూతి. అట్టి ఆత్మ ఇలా చెప్పును "ఇప్పుడు నాకు తెలిసినది ఏమని? నాకు సమస్తము తెలిసినదని చెప్పును". అంతయు తెలిసిన ఆత్మకు తెలియునది ఒక్కటే. అదే, తనకేమి తెలియదనే ఊహాజనిత భావము.

ఓ ! తెలివి తక్కువ అంతయు తెలిసిన ఆత్మా !
నీవెంత చెడు అవస్థలో వున్నావు !
ఓ ! బలహీనమైన, అతి బలవంతపు ఆత్మా !
నీవెంత చెడు అవస్థలోవున్నావు !
ఓ ! దుఃఖపూరిత అతిసుఖమయ ఆత్మా !
నీవెంత చెడు అవస్థలో వున్నావు !
ఎంత చెడ్డ అవస్థ ।
ఎంత చెడ్డ దృష్టి ।
ఎంత చెడ్డ ప్రకాశవంతం !

## 21. జ్ఞానభిక్ష

జ్ఞానమును రెండు విధములుగా పంచిపెట్టవచ్చు. 1. పరోక్షముగా 2. ప్రత్యక్షముగా. ప్రత్యక్షముగా జ్ఞానభిక్షకు రెండు విధములు, పరోక్షముగా జ్ఞాన భిక్షకు రెండు విధములు గలవు.

ఈ విషయము మనకు సరిగా అవగాహన అగుటకు సామాన్య మానవుని భౌతిక జ్ఞానావస్థను, ఒక పల్లెటూరి వాశి జీవితముతోను ఆత్మ సాక్షాత్కారము

పొందిన దైవజ్ఞానానుభూతిని న్యూయార్కు మహా నగరమందలి నగరవాశి జీవితముతోను పోల్చుకొందము. జ్ఞాన భూమికలైన ఆరు కూడ తాను చేరవలసిన రెండు ప్రదేశముల మధ్య నున్న ఆరు మజలీలు.

నీవొక పల్లెటూరివానిగా న్యూయార్కు మహానగరం వెళ్లి అక్కడ కొన్నిరోజులుండి అక్కడ జీవిత వాతావరణమునకు అలవాటుపడినప్పుడునీవు పొందే అనుభూతిని గురించి అక్కడివారికి గ్రామాల్లో వున్నవారి గురించి నీవు వివరించి చెప్పలేవు. కానీ నీవు నీ గ్రామమునకు క్రొత్త జ్ఞానముతో తిరిగివచ్చినప్పుడు నీకునీ గ్రామస్థుల భాష అలవాట్లు బాగుగ జ్ఞప్తియందే యుండును గాన, న్యూయార్కు వెళ్లినప్పుడు అక్కడ నీవుపొందిన అనుభూతిని నీ అలవాట్లను భాష ఎరిగిన ప్రదేశములోని వారికి చక్కగా చెప్పకలిగి వారిలో కొందరినైనా న్యూయార్కు వెళ్లి వచ్చుటకు వుత్సాహపరచి ప్రయాణము చేయించగలవు. అంతేగానీ నీకు కొత్తచోటైన న్యూయార్కులో నీ గ్రామాన్ని గురించి చెప్పలేవు.

కేవలము వర్ణనతో మాత్రమే వారికి ఉత్సాహము కలుగుచేయలేవు. న్యూయార్కు మహానగరపు ఘన వైభవమును, సినిమా ప్రొజక్టరు సహాయముతో చలన చిత్రము ద్వారా వారిలో వుత్సాహము పెంచగలవు. ఇట్టి దృశ్య అనుభవము చూపరులకు వాస్తవ అనుభూతిని కలిగించి తాము కూడ ప్రయాణము తప్పక చేయవలయునను ఉత్సుకత పెంచును.

ఇప్పుడు, యీ గ్రామస్తుడు ప్రయాణము చేయుటకు రెండు మార్గములున్నవి. 1. అతను స్వయంగా నీవు చెప్పు విధంగా నీ సూచనల క్రింద పయనించవలయును లేదా (2) తానే స్వయముగా పయనించవలయును. నీ సూచనల క్రింద అతని పయనమారంభమైనచో ప్రతిమజలీయందానంద మనుభవించును. నీయందాతనికున్న నమ్మకము, ప్రేమ, విశ్వాసములు అసంపూర్తి ప్రయాణము చేయించక ఇతరత్రా కర్మలచే బంధింపబడక సదా

రక్షించును. లేదా నీ వాతని కళ్లకు గంతలుకట్టి, నీ స్వంత జాగ్రత్తతో తీసుకొనివెళ్లినచో, న్యాయార్కు తీసుకొనిపోయి, అక్కడకు చేరిన పిదప అతని గంతనూడతీయు వరకాతనేమియు మార్గమధ్యమందు చూడజాలడు. ఈ రకమైన ప్రయాణము చాల సౌఖ్యమైనది, అతివేగవంతమైనది. కానీ ఏ రకమైన ప్రయాణమైననూ, అతని గమ్యము చేరిన పిదప తాను తెరమీద చూచిన అనుభవమును ప్రత్యక్షముగా కళ్లెదుట చూడగలిగి ఆనందించును.

దైవము యొక్క ప్రత్యక్షజ్ఞానము అనగా, భగవంతునితో ఐక్యమైనట్లు పొందు అనుభవము ఇట్టి అనుభవము, ఒక్క సద్గురువు యొక్క కృపవలన మాత్రమే కలుగును. కానీ వర్ణనలు, చిత్రములు ద్వారా పొందు పరోక్ష జ్ఞానము, మనస్సుకు కలిగే అనుభవము మాత్రమే.

సత్య పదార్థము తెలుసుకొనుట అనగా సత్యవంతుడగుట. అది నీ సమీపమందే వున్నది. నిజముగా అది నీవే. అజ్ఞానమువలన, అతి సమీపమందున్న దైవము నీకెంతయో దూరమందున్నట్లు భ్రాంతి కలుగును. సద్గురువు కృపవలన నీ అజ్ఞానపు తెర తొలగించబడినచో, నీవు నీవై నీలో నిగూఢమైన వాస్తవ సత్యము బయల్వెడలి, నీవు శాశ్వతుడవై ఎల్లప్పుడు వుండునట్లను గ్రహింపబడుదువు.

## 22. జ్ఞాన రకములు

జ్ఞానము మూడు రకములు :-

1. (బాహ్య జ్ఞానము) పదార్థజ్ఞానము :

బాహ్యజ్ఞానము భౌతిక సంబంధమైనది. ప్రాపంచిక వ్యవహారములు కలిగియుండును. అభ్యాసము ద్వారా ఇది సహజముగా సముపార్జింపబడును. ఇట్టి జ్ఞానము అజ్ఞానము యొక్క అజ్ఞానము.

**2. ఆధ్యాత్మికజ్ఞానము :**

అంతర్జ్ఞానము ఇది అంతర్గతమైనది. మనోమయ, సూక్ష్మ భూమికల యందు ఆధ్యాత్మిక అనుభవము కలిగియుండును. సూక్ష్మభూమిక అనుభవము గడించుట జ్ఞానము యొక్క అజ్ఞానము. మనోమయ భూమికయొక్క అనుభవము పొందుట అజ్ఞాన దశ యొక్క జ్ఞాన దశ. సూక్ష్మ భూమికయందు అంతర్గతముగా పొందు అనుభూతులు, దైవ సంబంధమైన ఎండమావులుకాగా, మనోమయ భూమిక యందు పొందు అనుభవములు, భగవంతునితో ఐక్యము కావలయునను ప్రగాఢవాంఛతో కూడిన ఆధ్యాత్మికపు స్వప్నము. ఈ అంతర్గత అనుభవములు దైవ ప్రేరణతో అంతమగును.

**3. దివ్యజ్ఞానము :**

ఇది భగవత్ స్థితి యొక్క బ్రహ్మజ్ఞానము. ఇది భగవంతునియొక్క స్వంత అనంత జ్ఞానము. ఇదే జ్ఞానము యొక్క జ్ఞానము. బాహ్య జ్ఞానము ఏ కొద్దిమంది వలనో గాని, సిద్ధింపదు. అంతర్జ్ఞానము చాల కొద్దిమందివల్లనే సిద్ధించును. బ్రహ్మ జ్ఞానము చాలా అరుదుగా ఒక్కరిచే మాత్రమే సిద్ధించును. అట్టి బ్రహ్మజ్ఞాని, సర్వజ్ఞుడు, సమస్తము తెలిసినవాడు అయనే జ్ఞానమునకు మూలము. కేవలం ఆయనయే జ్ఞానము.

# 23. పరిచయములు

విధి ప్రకారము, యిరువురు అపరిచితులు కలసినప్పుడు ఒకరి కొకరు పరిచయము చేసికొనుట అవుసరముగదా! అట్లు గాక, ఇరువురు, గాఢముగా ప్రేమించుకొనువారు, ఒకరికొకరు అభిమానించుకొనువారు కలసినవుడు వారికి పరిచయమవుసరము లేదు. వారి హృదయములు పరిచయమును కోరవు. అలాగే యిరువురు క్రొత్తవారు కలిసినప్పుడు వారి మధ్య ఆత్మీయతను గ్రహింతురు.

ఇంతకుముందెప్పుడో ఎరిగినట్లు భావింతురు. పూర్వ జన్మలలో వున్న అనుభంద రీత్యాయిట్టి భావము కలుగును.

నాకు ఎవరి పరిచయము అవుసరము లేదు. ఏలననగా నాకు ఎవ్వరూ క్రొత్తవారు కారు. ఏమైనప్పటికి నేను చాలామందికి క్రొత్తవాడినే. నాచెంతకు చేరి నా సమక్షంలో వుండే వారికి ఎట్టి పరిచయము అవుసరము లేదు. వాస్తవముగ వారింతకు పూర్వమే ఎన్నో పరిచయములు ద్వారా నన్ను చేరిరి. చాలాసార్లు వారి పూర్వ జన్మలందు అనేక మార్లు పరిచయం చేయబడి నావద్దకు వచ్చినప్పటికి, నన్ను వదలి వెళ్ళి మరచిపోయారు. తిరిగి నన్నిప్పుడు కలిశారు. యీ పరిచయములన్నియు ఈ సారి వారు నాకు చేసుకున్న పరిచయమే.

## 24. సహవాస సూక్తులు

ప్రేమికుడు, వాంఛారహితమైన ఆరాధన చేసినచో అదియే ప్రేమ అనబడును. అట్టి వాంఛారహితమైన ప్రేమ కలిగియున్నచో నీయొక్క సర్వము మార్పుచెంది, నీ జీవితము సమాప్తమై ముక్తిలభించును.

ప్రేమ నజరానా, అరుదైన దైవపారితోషికమే. అట్టి ప్రేమ నజరానా పొందే అర్హతకూడ, బహు అరుదుగా ఏ ఒక్కరికో మాత్రమే కలుగును.

భగవంతుడు నీ జీవిత గమనమునకు కారణభూతమైన నీఉచ్ఛ్వాస నిశ్వాసలకంటే కూడ నీ వునికి కొరకై అనంతమైన ప్రభావము కలిగియుండును. మామూలుగా జీవితము శ్వాసలతో కూడియుండును. నాడీ స్పందన ఆగినచో జీవితము స్థబ్దత చెందునను విషయము నీకు తెలిసినదే. శ్వాసశాశ్వతముగా ఆగిపోయి అంతిమ ఘడియలలో మునిగినప్పుడే యీ విషయము గ్రహింతువు. అదే విధముగా, నీవు సంపూర్ణ సమర్పణ భగవంతుని ఎడల కలిగిననాడే, నీవునికే ఆయన అని గ్రహించగలవు, నీవు ఆయన యొక్క దైవీ ప్రేమ మహా

సముద్రములో మునిగి తేలిననాడే ఆయనను సాక్షాత్కరించుకోగలవు.

ఆధ్యాత్మిక పథమును అర్ధము చేసుకొనుట చాలా కష్టము. అట్టి మార్గమును పొందుట అంతకంటే బహు కష్టతరము.

మానసిక వుపాసన అనగా నేమి?

అది ఏమి ఆలోచనలు కలిగి యుండకుండా వుంచుట అట్లు ఆలోచనలకు స్థానములేకుండా చేసుకొనుట దుర్లభము. కానీ, నీవు నన్ను నిలకడగా జ్ఞప్తియందుంచుకొని, నీ మనస్సు నాయందే లగ్న పరచినచో అట్టి మనస్సులో మరో ఆలోచనకు స్థానముండదు. ఇట్టి కఠోర వుపాసన, అత్యవుసరమైన నిజమైన వుపాసన అనబడును. నిరాహారుడై, కడుపుమాడ్చితే, ఆరోగ్య రీత్యా లాభించును. కానీ అది ఆధ్యాత్మిక పురోగమనమున కెంత మాత్రము సహాయపడదు.

నీవు నన్ను నీ కలలో చూచినట్లు చెప్పాదువు. ఇట్టి కలలు, నీకు నాయందున్న ప్రేమ, నమ్మికవల్ల నీవు ఏర్పరచుకున్న నీ స్వంత వూహలు మాత్రమే. అవి నాకు అంటకట్టవద్దు. నేను మీ మధ్యకు అచిరకాలము నుండి మాయావరణ జనితమైన కలలో మునిగిన మిమ్ములను మేల్కొలుపుటకే వచ్చియున్నాను. ఇంక ఏ మాత్రము మరిన్ని అట్టి కలలు మీకు రాకుండ చేశెదను.

## 25. గైరుహాజరు కొలండి

కన్నులుండీ చూడలేనివాడు
కర్ణములుండీ వినలేనివాడు
నోరువుండీ మాటలాడనివాడు
అట్టి వాడేనన్ను చూడగల స్థితిలో చూడగలడు.

నన్ను తెలుసుకొనగల రీతిలో తెలుసుకొనగలడు. దీని అర్ధము నీవు

అచేతనడవు కావలయునని కాదు. నీవు యెల్లప్పుడు, సర్వశక్తిమయుడు, ప్రియతముడైన భగవంతుని మోహన రూపము గాంచుటకు అనుక్షణము జాగరూకుడవై సిద్ధముగా వుండవలయును. అందుకే హాఫీజు అన్నాడు "నీ ప్రియతముని నీచెంతనే వుచుకొనవలెనన్న, ఒక్కక్షణము కూడ నీవాయన చెంత నుండి (గైరుహాజరు) మరుగు పడవద్దు"

సద్గురువు సర్వవ్యాపి అన్నిటియందున్నాడు. సర్వమునకు కేంద్రమాయన. అందువలన, ప్రతిప్రాణి, ప్రతి వస్తువు ఆయనకు సమ దూరమందుండును. అజ్ఞానముతో కూడిన పరిమితులు కన్న మనకు, ఆయన ఒకానొకప్పుడు, ఒక ప్రదేశములో అవతరించినట్లు బాహ్యముగా కనిపించును. కానీ ఆయన సర్వ కాల సర్వావస్థలయందు, అన్ని భూమికలలోను ఒకే మారు వుండును. ఆయన యదార్థ స్థితిలో నిజస్వరూపాన్ని చూచుట భగవంతుని దర్శించుటయే.

కనుక ప్రియతముడైన భగవంతుడు నీ చెంతకు చేరి నీ హృదయ కుహరమువద్దకు వచ్చి తలుపుతట్టు సమయంలో ఆయనకు నీవు దూరమవ్వక గైరుహాజరుకాకుండ వుండునట్లు జాగ్రత్త వహించుము.

## 26. నేను కోరునదే కోరుదు

నేను భగవంతుడను. భగవంతుని కతీతుడను మరియు మానవుని రూపమందున్న భగవంతుడను. నేను తరచుగా నా స్నేహవాత్సల్యములు నీయందు చూపి ఎల్లప్పుడు నిన్ను నా సన్నిహితునిగా చేసుకొందును. కానీ వచ్చిన చిక్కల్లా నేను భగవంతుడను అనే విషయం మీరుమరచుచున్నారు.

జరిగినది, జరుగబోవునది నేనెరుగుదును. నాఇచ్ఛ లేనిదే ఒకప్పుడు జరిగినది తిరిగి జరుగబోదు. నాకు తెలిసే, ప్రతివిషయాన్ని వాటి సహజ ధోరణిలో జరుగనిచ్చెదను.

నేను నిన్ను అడుగునది ఒక్కటే. సర్వకాల సర్వావస్థలయందు నీవు నన్ను ప్రేమిస్తూ విధేయుడవై యుండమని. నీవు నాకు విధేయుడవై యుండుట అతి కష్టమని నాకు తెలుసు. అందువలన ముఖ్యమైన విధేయతను మనస్ఫూర్తిగా ఎట్లు ఆచరించవలయునో మీకు నేర్పుటకు నేనే సహాయపడుతున్నాను.

ఎల్లప్పుడు నేనేది కోరుదునో దానినే ఆచరించుము. నీవు కోరదలచిన దానిని కోరవద్దు. మీలో చాలమంది ఇట్టి కోర్కెలనే కోరుదురు. ఒకవేళ అట్టి కోర్కెలు నానుండి పొందుటకు అనుగ్రహము బడసిరేని, మీరు ఆనంద పరవశులై, ఆ అతి సంతోషములో అవన్నీ నేను కోరినట్లు ఇతరలకు చెప్పుకొనెదరు. ఉదాహరణకు, మీలో ఒకరు ఒక యువకుని నావద్దకు తెచ్చి బాబా! ఇతను ఫలానా అని పరిచయము చేసి, అతను డబుల్ గ్రాడ్యుయేటని, డబుల్ గ్రాడ్యుయేట్ ఐన నా కుమార్తెకు చక్కని సంబంధమని, యీడు జోడు బాగుంటారని చెప్పి వారి వివాహమునకు నా అనుమతిని కోరెదరు. ఒకవేళ నేను అనుమతించనిచో నన్ను విడువక బ్రతిమాలాడుతూ, బాబా! నిజముగా అతడు చాలా బుద్ధిమంతుడు. నాకుమార్తెకు చక్కని జతగాడు అని ఒత్తిడి చేస్తే అనుమతించాను! అని నేను అన్న వెనువెంటనే నాగది దాటి నేను నీ కుమార్తెను ఆ ఫలానా యువకునికి ఇచ్చి వివాహము చేయమని చెప్పానని, నీవు ఇతరులకు చెప్పుట మొదలు పెట్టెదవు. ఈ రకమైన విషయములు మీలో చాలామందికి మామూలు. నీవు కోరుకున్నది నేను అనుమతించినప్పుడు, అది బాబాయే నిన్ను చేయమన్నట్లు నీవు చెప్పుకుందువు. కనుక సత్యవంతుడవై నీవు చెప్పేదాని యందు జాగ్రత్త వహింపుము. నేను నిన్ను కోరునది ఒక్కటే. బాబా ఏమి కోరునో దానిని కోరుటకు శాయశక్తుల ప్రయత్నింపుము.

నేను కోరునదేదో దానిని కోరుట నీకు సాధ్యముకాదని నాకు తెలుసు. నిజముగా నేను కోరుదానినే నీవు కోరుటకు నీకు సాధ్యపడని విషయము. నన్ను ప్రేమించవలసినంతగా ప్రేమించుట కూడ నీకు సాధ్యపడనిదే. కానీ, కనీసము, నీ కోర్కెలతో ఎల్లప్పుడూ కోరుతూ వుండక, నేను నిన్ను చేయమన్నపని మీద, నీ మనస్సు లగ్నపరచి, నీ హృదయము, ఆత్మ వీటి యందు కేంద్రీకరించుటకు ప్రయత్నింపుము.

నా యందు అతి గొప్ప ప్రేమ కలిగియున్నచో అట్టి నిన్ను నాకు విధేయునిగా చేర్చుటే నేను కోరేది. అట్టి గొప్పప్రేమ కలిగియుండుటయే నేను కోరేది.

## 27. నీ విధేయతా పారితోషికము

నీ హృదయమును నిర్మలముగా వుంచుడు. అంతర్గతముగాలేని దానిని, బహిర్గతముగా వున్నట్లు సంచరింపకుడు. అతి పవిత్ర వంతుడవైన సత్యవంతుడవు కమ్ము. భగవంతుడు అనంతమైన సత్యసంధుడు.

నేను భగవంతుని సేవ చేయుచున్నాను అని గొప్పలు చెప్పవద్దు. కారణమేమనగా భగవంతుడు సర్వాంతర్యామి. అట్టి భగవంతుని మోసపుచ్చలేవు. అందుచేత, నీవు కాని దానిని, అయినట్లేల మోసపుచ్చుకొందువు ?

నీవిధేయత అనే పారితోషికము తప్ప నీ నుండి నేను కోరునది ఏమియులేదు. అదే నాకిమ్ము. అజ్ఞాన బంధములనుండి విముక్తడవుకమ్ము.

## 28. దేవుని ప్రతిస్పందన

భగవంతుని ప్రేమించుటకు బదులు ఆయన్ని అర్థము చేసుకొనుటకు ప్రయత్నించినచో ఆయనను అపార్థము చేసుకొనుట ప్రారంభిస్తావు. నీ అజ్ఞానము, నీ స్వార్థమును పోషించును. అది సుదూరమందుండుట వలన నీ మనస్సు చేరలేదు. కాని భగవంతుడు అనంతుడు. నీ మనసు చేరలేని సుదూరమున కాయన అతీతుడు.

అనంతమైన యీ మాయా వరణమునుగొని తెచ్చిన ఆ దైవేచ్ఛ నాద్వారా స్వచ్ఛమైన మార్గముద్వారా, యీ మాయ నుండి నిన్ను దైవజ్ఞానము వైపు పురోగమింపచేయును.

అనుక్షణము ఈ సర్వసృష్టికి నేను జవాబుదారి వహింతును. దైవికముగా నా జవాబు పూర్తిగా ప్రేమనుండి వెలువడును. బహుముఖములు గల ఆఒక్క జవాబు నీవు చూడగలిగినప్పుడు, బహుముఖ ప్రతిబింబములు చూపే కటకము వంటి నీ మనస్సు యొక్క ప్రతిబింబమే అది. నీ భావనాశక్తికి తగ్గట్లు నీవు వూహించి నాయొక్క చేతలను నిర్ణయించెదవు. అట్టి చర్యలను, నీ పరిమితమైన విలువల దృష్టిలో భేదమును గ్రహించుటకు ప్రయత్నింతువు. అందువలననే, విభిన్న వ్యక్తులకు నేనిచ్చే విభిన్న జవాబులను నీవు అవగాహన చేసుకొనలేక వాటికి విపరీతార్థములాపాదింతువు. అనంతుడనగుటవలన నేను వరుసగా ఒకేమారు అన్ని జ్ఞాన భూమికలందు వుందును. అందుచేత, నా జవాబులో వారు చేసుకున్న సంస్కార ఫలితముగా ఒకరి నుండి ఒకరిని వేరు చేయగలను. లేదా విభిన్న జ్ఞాన భూమికలకు వారి సంస్కారములు పెరుగునట్లు చేయుదును. వివిధజ్ఞాన భూమికలందున్న నా పిలుపు కోరే వారి అవుసరమునకనువుగా నా ప్రతి చర్య ఒక జవాబగును. ప్రకృతి సిద్ధముగా నా దైవ ప్రేరణ ఒక్కొక్కప్పుడు అర్థరహితములై తోచును.

నా చర్యల వుద్దేశ్యమును నీ పరిమిత మనస్సుతో అర్థము చేసుకొనుటకు ప్రయత్నింపకుము. వాటిని అనుకరించుటకు కూడ ప్రయత్నింపకుము. నేను చేయుదానిని నీవు చేయరాదు. కానీ నేను చేయమని చెప్పిన దానినే నీవు చేయవలయును. నీ గ్రహణ శక్తి పరిధిలోనికి నాయొక్క ప్రతి చర్యను తెచ్చుటకు నీవు ప్రయత్నిస్తే అది నీ జ్ఞానశక్తి యొక్క పరిధుల నర్థము చేసుకొనుటయే !

అప్పుడప్పుడు నాకు మీయందున్న ప్రేమ వాత్సల్యములచేత అయోమయంలో ఉన్న మిమ్మల్ని చూచిచలించినా చర్యకు కారణము విశదీకరింతును. అందువలన నా యొక్క అట్టి విశదీకరణములతో నా చర్యలను మభ్యపెట్టినట్లు కనపడును. అనగా నీవు అట్టి అర్థము తీసుకొన్నచో అది నీ దుర్బలత్వమును చూపును. అది నా శక్తిని ప్రస్ఫుటించును.

కానీ ముఖ్యముగా నీవు జ్ఞప్తియందుఉంచు కొనుము! "నేను నా చర్యలకు విశదీకరణము నిచ్చినప్పటికి, అవి ఎల్లప్పుడు నీ జ్ఞానమునకు దూరముగానే యుండును. నిరాడంబరమైన నాదివ్య లీలను అర్ధము చేసుకొనుట బహుకష్టము. నీ తెలివి వలన దానిని అర్ధము చేసుకొనజాలవు'

నీవు ఎంతగా నాకు సన్నిహితుడవై, విశాల హృదయంతో నా ప్రేమను స్వీకరింతువో, అంత విశాల హృదయంతో నన్నంగీరకించుటకు ప్రారంభించెదవు. నీవు నన్నెంతగా చూడగలవో, అంత ఎక్కువగా నీవు సమాధాన పడెదవు కానీ ఎంత తక్కువ చూడగలవో, అంత తక్కువ నన్నర్ధము చేసుకొందువు. దివ్య క్రీడ విశాలమైన అనంతమందు జరుగునప్పుడు నీవందు తిరుగాడుతూ, ఏదో ఒక సమయమందు అంత్య ఘడియలకు చేరుకొని నన్నర్ధము చేసుకొనలేక వేసారిపోదువు.

ఒకవేళ నాచర్యలు నీకు అగమ్యమైనచో అది నాయందు నీకు సంపూర్ణ నమ్మకము లేకపోవుట వల్లే. అందువలన అనుమానమనునది సమూలముగా తొలగింపుము. నేనేది చేసినా అది మంచికేనని గుర్తుంచుకొనుము. నా ప్రతి చేతలు నా దైవ ప్రేమనుండి జనించిన దైవ ప్రతి స్పందన మాత్రమే.

## 29. ప్రశ్నార్ధక మనస్సు

కొద్ది ఘడియలు మాత్రము నా చెంత గడుపుట కొరకై వందలకొలది మైళ్లు ప్రయాణము చేసి మిమ్ములను నా వద్దకు, మీకు నాయందున్న నమ్మకం, ప్రేమ యివే తీసుకువచ్చినవి. మీరు నన్నేమి ప్రశ్నించవలదని మీకు కబురంపిననూ, మీలో కొందరు నన్నేదో అడుగవలయునని అవకాశము కొరకు ఎదురు చూచుచున్నారని నాకు తెలుసు. అట్లు అడుగుతూ పోవుట మనస్సుకు ప్రకృతి సిద్ధము. కానీ ప్రేమ ఏ ప్రశ్నలు అడుగదు. అది ఏమి కోరదు కానీ భగవంతుని ఇచ్చను మాత్రము కోరును.

మనస్సున కావలనున్నదేదో తెలుసుకొనుటకు మనస్సు వుబలాటపడును. అట్లు మనస్సు కావలనున్నదేదో తెలుసుకొనవలెనన్నచో మనస్సు పోవాలి, క్షాళనము గావాలి. దానివెనుక ఏమీ మిగలరాదు. గమ్మత్తు చూచారా! పరిమితమైన మనస్సు, తాను తానుగా వుండి అనంతమైన సత్యాన్ని తెలుసుకోవాలంటుంది. ఇదీ తెలివి తేటలు ద్వారా సత్యాన్ని తెలుసుకొనుటకు ప్రయత్నించేవారి స్థితి. బహు కొద్దిమంది యీ నిజాన్ని గ్రహించగలరు. అనేకులు గ్రహించుటకు వృధా ప్రయాసపడుదురు.

ప్రశ్నించుట బహు తేలిక. కానీ అందుకు నేను చెప్పే వివరణల్ని, గ్రహించుటకు ముందు జాగ్రత్తలు చాలా అవసరము. నన్ను కోరగల అధికారము, అర్థము చేసుకొనగల శక్తి వున్నవారు నన్నసలు ప్రశ్నలను అడుగనే అడుగరు. భగవంతుడు అర్థము చేసుకొనుటకు అతీతుడని వారెరుగుదురు. ప్రశ్నించే మనస్సున కతీతుడని కూడ వారెరుగుదురు.

ప్రతివారు సుఖశాంతులతో వర్ధిల్లాలని కోరుకుంటారు. మీలో ప్రతి ఒక్కరు, అసంతృప్తితో సతమతమవక సుఖముగా వుడవలెనని కోరుతారు. వాస్తవముగా మీరే ఆనందమయులు. కానీ మీ ముందున్న యీ మాయ ఎంత హాస్యరసకరమైనది ? అది నీవు అర్థము చేసుకొనుటకు నీ చేత ఎట్లాంటి ఆటను ఆడిస్తున్నది!

నా ప్రేమికులొకరు పిర్యాదు చేసిరి - "బాబా! నేను స్వచ్ఛమైన జీవితము గడిపితిని. కానీ నేను చాల బాధలను భరించవలసివచ్చినది అని'. బహుశః మీరంతా కూడ ఇదే మాదిరి పిర్యాదును కలిగియుండవచ్చును. అట్లుండుటకు కారణమేమనగా దానివెనుక వున్న ఉద్దేశ్యమేమిటో మీకు తెలియదు కనుక. మీరు బాధలు అనుభవించి తీరవలయునని నేను అనను. నా వుద్దేశ్యము మీరు ఆ కష్టములను ఎవరిని నిందింపక అనుభవించవలయుననియే.

విశ్వాన్ని పాలించే చట్టము ప్రకారము, యీ అనుభవించే కష్టాలన్నీ నీలో నిజమైన స్వార్థమును ప్రతిష్ఠించుటకు చేసే ప్రేమ యొక్క ప్రతిఫలమే. నేనే

భగవంతుడను అనుస్థితికి నీవుచేరినప్పుడు పొందే అనంతానందానుభవముతో పోల్చినప్పుడు నీవనుభవించే కష్టములు అంత చెప్పుకోతగ్గవేమీ కావు. అట్టి అనంతానందమునకు మార్గదర్శిని నేనే. నిన్ను నా వద్దకు తెచ్చి నీవే అనంతానందమని నీకు తెలియజేయుటకు నేను వచ్చి మీ మధ్య అనంతమైన బాధలననుభవిస్తున్నాను.

నేను దివ్య సనాతుడను. నేనే భగవంతుడనని చెప్పినప్పుడు అది నేనూహించి చెప్పినది కాక, నేనే భగవంతుడనని నిర్ధారణచేసియే చెప్పినదగును. అదినిజమని నేనెరుగుదును. తాను భగవంతుడని ప్రకటిస్తే యితరులాతని దైవదూషణ చేయుదురు. నిజముగా నేను దైవము కానని చెప్పినచో అది దైవధూషణ అగును.

నీవు "నేనుమానవుడనని" చెప్పినప్పుడు అది తప్పెట్లగును. ఈ విషయములో నీ మనస్సున అనుమానమునకు తావు లేదు గదా! దీనికే రుజువు అవసరము లేదు. ఏ వాదన దీనిని మార్చలేదు. ఇది అత్యున్నతమైన సత్యవార్త. ఒకవేళ నీవు జంతు స్థాయికి దిగితివి అనుకొనుము. అప్పుడు నీవు జంతువుతో నేను మానవుడనని చెప్పెదవు. నేను మానవుడను. నీవు కూడ ఒకరోజుకు మానవుడవగుదువందువు. అట్లే నేను నీ పరిధికి దిగివచ్చితిని. నా దివ్యమైన అనంతజ్ఞానమును విడనాడక నీ జ్ఞానమును కూడ అనుభవించుచున్నాను. నీవు కూడ భగవంతుడవేనని మళ్లీ మళ్లీ నీకు చెప్పుటకే నేను భగవంతుడనని పదే పదే చెప్పుచుంటిని. నేను భగవంతుడను. ప్రతివారు సమస్తము భగవంతుడు గాక వేరు కాదు. ఒకరోజున జ్ఞానోదయమయినప్పుడు ప్రతివారు భగవంతుడగుదురు. సృష్టి సర్వము దైవమాయయే.

లేనిది వున్నట్లు నటించుట తప్పులలో కెల్ల చెడ్డ తప్పు. తానట్టివాడై ఇతరులట్లుండవద్దని నీతులు చెప్పువాడు ఇంకా పెద్ద మహా కపటి. మీరంతా సత్యసంధులు కావలయుననియే నేను కోరుదును. మీరు కాని దానిని అయి ఉన్నట్లు నటింపకుడు.

మీలో ఒకరందురు - బాబా "నేనునీపనిని నిజాయితీతో న్యాయముగా చేయుచుంటిని. అయినప్పటికి నేను సుఖముగా లేనుఅని" ఇందుకు ఎవరిని నిందించాలి? నీ బలహీనతకు భగవంతుని నిందించవలయునా? మీ నిజవర్తనకు నేను సంతోషించితిని. నీ స్థితికి ఎవరిని నిందించలేనంతటి రుజువర్తనుడవై మెలగుము. నీవు కోరుకొనవలసినదల్లా నీవట్టి రుజువర్తనుడవు కావలయుననియే. ఒకవేళ నీవెవరినైన నిందించదలచినచో నన్నే నిందింపుము. ఎందువలన? - ఈ విశ్వమందలి సర్వస్వము నా నుండి వుద్భవించినవే కనుక నీవు నిందించదలచినప్పుడు ఆ నిందలను పొందవలసినది నేనే గదా! కానీ, నీ జన్మ కారకుడనైన నేను మీ ఎడల ఎంతటి అనురాగము, దయ, జాలి కలిగియుందునో మీరెరుగరు. ఇంతవరకు జరిగినదంతా జాలి వల్ల కరుడుగట్టినది. దీనిని నీవు అర్థము చేసుకొనలేవు. మనస్సును చంపుకొని దానికతీతుడవైతే గాని నీ కర్థము కాదు.

ఒకవేళ నీలోని బలహీనతను నేను ఆసరాగా తీసుకొందునేని, అది మీ మంచికే. బలహీనత శక్తిలో ఒక భాగమే. నా అనంతమైన జీవనములో నేనే సర్వమని, సమస్తమని తెలుసుకొన్నందున మీరు కూడ సర్వాంతర్యామియే, మీరు నేను అనే బేధము లేదని మీకు తెలియజెప్పుటకు నేనెంతయో మహదానందముతో మీ ద్వారా బాధలు అనుభవించుచున్నాను.

మీరు సుఖముగా ఏల మనజాలరు? అశాంతితో వుండుటకు గల బంధము లేవి? బంధనములు నీవు స్వయంగా కల్పించుకున్నవే! నీవు నిజముగా స్వేచ్ఛ పొందవలెనని కోరుకొంటే బంధనములను అధిగమించవచ్చును. స్వేచ్ఛా వాయువులకు నీకు నీవే ప్రతిబంధకమగుచున్నావు. ఊరికే స్వేచ్ఛ కావాలని కోరినంత మాత్రము చేత సరిపోదు. అట్టి దానిని గూర్చి నీవు చెప్పినా లేదా ఆలోచించినంత మాత్రము చేత సరిపోదు. అంతర్గతముగా నీవు మనస్ఫూర్తిగా ప్రయత్నించాలి. నీకు దైవమే కావాలంటే నీవా దైవాన్నే ఆరాధించాలి. అట్లు చేసి సత్య పథాన సంచరిస్తే నీకు దైవసాన్నిధ్యము సంప్రాప్తిస్తుంది. అట్లు

పొందకలిగినందుకయ్యే మూల్యమెంత? అది నీ ప్రత్యేక ఉనికి. నీవు నీ స్వార్థాన్ని త్యజించినప్పుడు సత్యసంధుడవై నిజమైన నీవుగా మిగులుదువు.

సత్యము, మనస్సు చేరలేని దానికతీతమైనది. అది అనుభవ పదార్థము. మనస్సు చంచలమైనది. అది తేలికగా తప్పించుకొనిజారిపోయి, నిన్ను స్వాధీనములో వుంచుకొనుటకు మిక్కుటమైన విచారములు కలుగుచేయును. అది నిన్ను "కేవలము నేను భగవంతుని కొరకే జీవించలేనని" నేను నా కుటుంబము కొరకు నా విద్యుక్త ధర్మాన్ని నెరవేర్చవలయునని. నా సంఘానికి, నా జాతికి, నా దేశానికి యీ ప్రపంచమందు నా విధులను నేను నిర్వర్తించవలయునని చెప్పేట్లు చేయును. అందువలన నీవు యింకా మాయలో గుంజబడుదువే గాని సత్యమువైపు మరలలేవు.

సత్యము చాల సులభమైనది. కానీ మాయ, దానినర్థము చేసుకొనుటకు వీలు కాకుండా చేయుచున్నది. అట్టి సత్యమును పొందవలననే కోర్కెతో తృప్తిపడనివారు బహు అరుదు. తక్కినవారు మాయలో మరిన్ని బంధనములు పెంచుకొని మాయలోనే బంధింపబడుదురు. దైవమే సత్యము. సృష్టిలో నీవు చూచే అనుభవించే సమస్తము మిధ్య. అవన్నీ వరుసక్రమ శూన్యములు.

నేనే అనంతజ్ఞానము, అనంతశక్తి అనంత ఆనందమును. నేను ఇవ్వవలయునని భావించినచో ఎవరికైన భగవంతుని ఎరుకపరచగలను. నాకిప్పుడే భగవంతుని ఏల చూపరాదని మీరడుగవచ్చు? కానీ అది నీవే అని ఏల మీరు గ్రహించలేరు? నీ పక్కవారు లేదా బజారులో సంచరించువారు లేక ఆ చెట్టుపైనున్న పక్షి లేక యీ రాయి, ఈ మొదలైనవన్నీ వేరు వేరు రూపములో వున్ననూ అవన్నీయూ ఒకటియే కదా? - నీవు నన్ను ఎంత ఎక్కువగా ప్రేమిస్తే అంత త్వరగా నీలోని స్వార్థాన్ని త్యజించి, నీవెవరవో తెలుసుకొనగలుగుదువు. నేనందరిలో వున్నాను కనుక అందరిని సమంగా ప్రేమింపుము. నా యందలి నీ ప్రేమ నిన్ను నేనుగా గుర్తింపచేయును.

కేవలము మేధాశక్తి మాత్రమే దైవమును నీ చెంతకు చేర్చజాలదు. ఒక

ప్రేమ మాత్రమే దైవసాన్నిధ్యమును చేర్చగలదు. ప్రశ్నించుట గర్వకారణమై. ఎడబాటు కలిగించును. అందువలన ప్రశ్నింపక, సద్గురువుకు బానిసవు కమ్ము.

సద్గురువుని ఆలింగనముతో సమానమైన పవిత్రమైన, నిర్మలమైన మనస్సు కల జీవనము ఆధ్యాత్మిక పథముకు సోపానము. సనాతనుడనైన నా యొక్క ఆలింగనము నీలో ప్రేమ బీజాన్ని నాటి నిద్రాణమై యున్న శక్తిని మేల్కొల్పును. అట్టి బీజము మొలకెత్తి, పుష్పించి, ఫలించుటకు బహుకాలము పట్టు సుదూరము కలదు. నిజానికి నీ గమ్యము చేరుటకు దూరము దగ్గర అని గాని, సమయముగాని లేవు. శాశ్వతమైన దైవ మందు, సమస్తమూ ఇప్పుడే ఇక్కడే వున్నవి. నీవు మాత్రము నీవెవరవో అది కావలయును. అనగా నీవు భగవంతుడవు. అనంతుడైన స్థితి గలవాడవు సుమా!

## 30. జాగ్రద స్వప్నావస్థ నుండి నిజమైన జాగ్రదవస్థకు చేరుట

అనంతుని ప్రథమ చరణము సృష్టికి ప్రారంభమగును. అట్టి సృష్టి పరబ్రహ్మ పరమాత్మని జననమరణాయుతమైన ద్వంద జీవనమునకు అవతరణ చేయుచున్నది. అంతులేని అనుభవముల సమ్మిళితమే ద్వందజీవితము.

నాకు, నేనే అనంతమైన దైవమని తెలుసును గనుక శాశ్వతమైన సుఖముననుభవించుచున్నాను. నేను మాత్రమే స్థిరము. నా చెంత మరేదియు లేదు. తక్కినవన్నీ మాయ.

నేను స్వేచ్ఛాజీవిని. కానీ, నీలో నీవుగా నేను బంధింపబడియున్నాను. నేను తెలిసియే నిన్ను నీ సంస్కార బంధముల నుండి విముక్తి చేయుటకు నీ ద్వారా బాధలననుభవించుచున్నాను. ఇది నాకు శిలువలాంటిది. నీ అజ్ఞాం

చేత నీవే బాధలు పొందుతున్నట్లనుభవిస్తున్నావు. అట్టి నీ అజ్ఞానమే నా బాధకు కారణం.

మీరు నా ముందు కూర్చొనియున్నారు. ఒక్కొక్కరు వేర్వేరు స్థానములు ఆక్రమించియున్నారు. సంఘములో విభిన్న స్థానములనుండి మీరంతా వచ్చియున్నారు. మీరంతా వేర్వేరు మానసిక, శారీరక ప్రత్యేకతలు, అలవాట్లు కలిగియున్నారు. మీ మీ సంస్కార ఫలితముల వలన మీరు ప్రత్యేకముగా భావించబడుతున్నారు. కానీ అగోచరమైన పరమాత్మ నుండి వేరు పడిన భాగములే మీరంతా. ఆత్మ ఎప్పుడూ విభజింపబడదు. అది అవిభాజ్యము. అది ఎల్లప్పుడు ఒకటిగానే వుండును.

నీవు నిజముగా పరమాత్మయే. కానీ సంశయ మనస్సుతో నీవు గుర్తించలేకున్నావు. అందువలన నీవు బాధలు భరించవలసి వచ్చుచున్నది. నీవు క్షణికములైన సుఖదుఃఖములను అనుభవించుచున్నావు. ఒకవేళ బాధలు నీ సుఖములు కన్న అధికమైన లేక సుఖములు కన్న బాధలే అధికమైన గానీ రాత్రి సుఖనిద్ర కలుగువరకు రోజంతా వాటి ఫలితములను చవిచూచునే యుందువు. నిద్రలో మాత్రమే అచేతనుడవై సుషుప్తిలో మునిగిపోవుదువు.

గాఢనిద్రలోనిన్ను నీవు పూర్తిగా మరచి పోవుదువు. నీ పరిసరములను మరచెదవు. నీ ఆలోచనలు, ఉద్రేకములు, వూహలచేత పెనవేయబడి, సుఖదుఃఖ సంయుతమైన వూహాప్రపంచమును సృష్టించు కొందువు. కానీ యీ వూహాజనితమైనది అత్యల్పము.

గాఢ సుషుప్తి స్థితి నుండి మామూలు జాగ్రదవస్థకు దిగివచ్చితివి. అట్లు నీవు జాగ్రదవస్థకు వచ్చునప్పుడు నీవు తప్పనిసరిగా అది క్షణము గాని ఎంతైనాగాని స్వప్నావస్థ నుండి రావలయును.

నీకు ఒకప్పుడు అట్టి కలలో, మధురమైన సుఖవంతమైన నీ వూహలు ఫలవంతమై ఉల్లాసాన్నిచ్చే స్వప్నం వచ్చియుండవచ్చును. అట్టి మధుర స్వప్నం ఒకక్షణం గడచేలోపల నీవు మేల్కొనవలసివచ్చినచో అప్పుడు నీవు పొందే వ్యథ, ఆదుర్దా వర్ణనాతీతము. అయ్యో పావము! ఇది కలయే గదా! అనుకొందువు.

మరి వేరొకసారి నీవు ఎన్నో బాధలననుభవించుచున్నట్లు భయంకరమైన స్వప్నము కనెదవు. భయంకరమైన దృశ్యములు చూడలేక మేల్కొనుటకు

ప్రయత్నించెదవు. ఈ స్వప్నము శాశ్వతమైనదిగా తోచును. మేల్కొనగానే భగవంతునికి ధన్యవాదములు చెప్పి పీడకల వదలినదని యిది కలయే గదా! అని తృప్తి పడెదవు.

స్వప్నావస్థలో నీవు సుఖములననుభవించెదవు. నీవు మేల్కొంచునప్పుడు అంతవరకు నీవు పొందిన సుఖదుఃఖములు స్వప్నములోనేయని గ్రహింతువు. ఇది అంతా ఒక మాయ. అదే విధముగా, ప్రస్తుతము వున్న జ్ఞాన స్థితి అనగా నీదనే జాగ్రదవస్థ నిజమైన చైతన్యస్థితితో పోల్చినప్పుడు అది స్వప్నావస్థ తప్ప వేరుగాదు. నీ జీవితమే ఒక స్వప్నం. అది పవిత్రమైన దివ్య స్వప్నంలో అంతర్భాగము. అదే యీ విశ్వం. అందులోని భాగమే నీ జీవితం.

నీ ప్రస్తుత జాగ్రదవస్థ నుండి నిజమైన జాగ్రదవస్థకు నీవు చేరవలయునన్న నీవెన్నో స్వప్నమరణావస్థల ననుభవించవలయును. నీ మామూలు సహజ స్వప్నము నుండి నీవు, అదే ప్రదేశమునందు మేల్కొనెదవు. కానీ మరణానంతరము నీ జన్మ క్రొత్త పరిసరములందు జరుగును. కాని అంతమాత్రము చేత నీ సంస్కారములురహితమవ్వక పరిసరములు మారిననూ అవి నిన్ను వెన్నంటును. కర్మ, అబేధ్యమై నిన్ను వీడక నీ జీవితముననుసరించును. విచిత్రమేమంటే నూతన జీవితము, నవీనమైన ఆవేదనల్ని సృష్టించును. మాయయొక్క పట్టు ఎంత బలీయమైనదంటే అది నీకష్టములందు సహాయమనునది లేకుండ చేయును. అందువలన జాగ్రదవస్థయందలి నీ జీవితము అంతములేని గొలుసువలె బాధామయమైయుండును.

స్థూల శరీరముతో నీవు పునర్జన్మలు పొందుతూ ఆత్మజ్ఞానముపొందేవరకు అనేక జన్మలు పొందుతున్నావు. కానీ మానసికముగా నీవు ఒకేసారి జన్మిస్తున్నావు. ఒకేసారి మరణిస్తున్నావు. దీనిని బట్టి నీకు పునర్జన్మ అనునది లేదని తెలియును. స్థూల శరీరము మారునేగాని, మానసిక శరీరము మాత్రము చివరవరకు మారదు. నీ సంస్కారములన్నియు మనస్సులోనే భద్రపరచబడును. రాబోవు జన్మలలో యీ సంస్కారములురహితమవుట గాని లేక పెరుగుట కాని ఆయా జన్మలలో నీవు పొందే నూతన సంస్కారముల బట్టి యుండును. పునరపిజననం పునరపిమరణం. బుద్ధుని ధర్మచక్రం, జనన మరణములను సూచించును. ఆ చక్రము ఆద్యంతములు లేక కదలుచునే యుండును. అది నిన్ను

ఉన్నతస్థానమునకు చేర్చును, అగాధములోనికి గూడ తోయును.

రాబోయే జన్మలకు నీ సంస్కారములు అనుసంధానములనుటకు మీకొక ఉదాహరణ చెప్పెదను. బ్రహ్మాండమైన ఆస్తిపాస్తులు కల ఐశ్వర్యవంతుడైన రాజొకడు కలడు. కానీ అతడు పనికి మాలిన రాజు. అతడు తన విద్యుక్త ధర్మములు విడనాడి, శక్తి సామర్థ్యములు స్వార్థ చింతనలవైపు మరల్చి ధనవ్యయము చేసి ఖులాసాగా గడిపి తరువాత జన్మలో ఆయన పుట్టుగ్రుడ్డియై భిక్షకుడుగా జన్మించెను.

ఆతని సేవకుడొకడుండెను. అతడు బహునమ్మకస్తుడు. విధేయుడు మరియు కష్టపడి పనిచేసేవాడు. ఇతడు తన తరువాతజన్మలో అతని పూర్వజన్మ సుకృతమువలన మంచి స్థితిపరులైన సంపన్న కుటుంబమందు జన్మించెను. ఒకరోజున అతను వీధివెంట వెళుతుండగా బాటవెంట ఒక హీనస్వరము వినెను. గత జన్మలో రాజై, బిక్షకుడుగా ఇప్పుడు జన్మించిన గ్రుడ్డివానిదాస్వరము. దయతలచి, భగవంతుని పేర ఒకపైసా దానముచేయమని ప్రాధేయపడుతున్నాడు. భగవంతుని చేష్టలు అనూహ్యములు. ఒక్కొక్కప్పుడు అంత ప్రాముఖ్యత కూడలేకపోవచ్చు. ఈ రాజు విషయంలో చూడండి ! గతజన్మలో రాజైననూ యీ జన్మలో అంధుడైన భిక్షకుడిగా పుట్టించి, ముష్టిగా కొద్ది రాగినాణెములు ధర్మ మిప్పిస్తున్నాడు. పూర్వజన్మ సంస్కార బంధనములు, కోర్కెలను, ప్రతికోర్కెలను సృష్టించును. ఒకరాజు భుక్తి కొరకు యాచించుట, ఆతని సేవకుడే అతనియందు జాలిపడి ధర్మమిచ్చుట - ఏమి హాస్యము. ఏమి అదృష్టము యొక్క ఘనత! ఇదే కర్మ చట్టము పనిచేసే విధానము. ఇదే ప్రాపంచిక విలువలలోని న్యాయాన్ని ప్రకటించే తీరు. కర్మ సిద్ధాంతానికి పక్షపాతము లేదు మార్చుటకు వీలులేనిది. దానికి మినహాయింపులు లేవు. ప్రత్యేకత లేదు. సడలింపులు లేవు. అది న్యాయాన్ని వెదజల్లును.

ఆధ్యాత్మిక చట్టం వలన, నీవు నీ గత జన్మలను గురించి తెలిసుకొనకుండ రక్షింపబడుచున్నావు. అట్లు కాక, పూర్వజన్మల రహస్యమును నీవెరిగినచో అనేక చికాకులేర్పడి ప్రస్తుత జీవితము దుర్భరమగును.

నాకు గతమనునది లేదు. నేను శాశ్వతమైన వర్తమానమందే వున్నాను. నేను మీ అందరి గత జన్మలను విపులంగా చూడగలను. అనేకమందితో వున్న

సామీప్యము సన్నిహితత్వములు అందుకు ఉపకరించును. గత జన్మలలో మీలో కొందరికి గల సంబంధము యీ జన్మలో మీ మధ్య వున్న సంధానము. ఇవి చూస్తే నాకు నవ్వు వస్తుంది. అది నాలోని కొంత బాధను కూడ తగ్గించును.

ఇప్పుడు నేనింకొక వుదాహరణ చెప్పెదను. అది సర్వసాధారణముగా జరిగేదే. ఒక మహమ్మదీయుడు తన మరణానంతరము స్మశానమందు సమాధి చేయబడెను. కొన్ని జన్మల తరువాత అతడు తిరిగి మహ్మదీయ కుటుంబమందే అదే పట్టణమందు జన్మించెను. సమాధులుచూచినప్పుడు చచ్చిపోయినవారి ఆత్మకు శాంతికొరకై ప్రార్థన చేయుట మహమ్మదీయుల ఆచారము. అందువలన యీ వ్యక్తి తన స్వంత సమాధిముందు నిలబడి "ఇతని ఆత్మను భగవంతుడు రక్షించుగాక" అని ప్రార్థించెను. ఇది ఎంత అవివేకము? ఎంత అమాయకము?

జననమరణముల కాలచక్రము ఆగకుండా పరిభ్రమిస్తూనే వున్నది. నీవే మగవానిగా, స్త్రీగా, ధనవంతునిగా, దరిద్రునిగా, మేధావిగా, మతిహీనుడుగా, ఆరోగ్యవంతుడుగా, బలహీనుడుగా, నల్లగా, తెల్లగా, వివిధ జాతులందు, వివిధ మతములందు, కులములందు ఆయా జన్మల సంస్కార ఫలితముగా జన్మించుచున్నావు. దీనితో పాటే కర్మసంస్కారముల జమాఖర్చులుకూడ పెరుగుచున్నవి. అవి రహితమైనపుడు తరుగును, పెరిగినపుడు పెరుగుచున్నవి. మరి నీ ఖాతానెప్పుడు మాఫీ చేసుకొనెదవు? అవతారుడు లేక సద్గురువు ఎవరైతే పరమాత్మ స్వరూపుడై విశ్వాత్మక మనస్సు కలిగియుండునో అట్టి సద్గురువు ద్వారా మాత్రమే యీ కర్మ వ్యాపారమునుండి విముక్తుడవగుదువు.

నాకు సర్వము సమస్తమైనవారి జీవితముఒక తెరిచిన పుస్తకముతో సమానము. అది నేనానందించుటకు చూచే సినిమా వంటిది. ఎల్లప్పుడు వుంటూ ఎన్నడూ అంతము కాని యీ సినిమాకు నేనే నిర్మాతను. ఇట్టి సినిమాయే యీ జగత్తు. ఈ జగత్తు నందే నేను నీవై, నిన్ను స్వప్నావస్థ నుండి నిజమైన జాగ్రదవస్థకు మేల్కొలుపుటకు మారుతున్నాను. ఇట్టి స్థితిని నీవు అనుభవించిననాడు, జాగ్రద స్వప్నావస్థ అంతా శూన్యమని గ్రహింతువు. అట్టి అనుభవము కలుగవలెనన్న నానజరు కావలయును. ఎప్పుడైతే నా నజరు నీయందు ప్రసరించునో అప్పుడు నీవు నేను అగుదువు.

# 31. అనంత చైతన్యాన్ని నేనే

ఆ పురాణ పురుషుడను నేనేనని నమ్ముము. ఒక క్షణమైనా దానిని గురించి అనుమానించవద్దు. నేను నేను కాదు అనుటకు ఇతరులెవ్వరికి వీలు లేదు. మీరు చూచే యీ శరీరము నేను కాదు. అనంత చైతన్యాన్ని నేనే. నేను మిమ్ములను దర్శించుటకు వచ్చునప్పుడు ధరించే కోటువంటిదే యీ శరరీము. నేను మీతో కూర్చుంటాను, ఆడుతాను, పాడుతాను, నవ్వుతాను. అదే సమయములో నేను అన్ని భూమికలలోనూ ఒకేసారి వుంటాను.

సాధువులు, యతీశ్వరులు మరియు సద్గురువులు, వారి ఆధ్యాత్మిక పథముయొక్క ప్రారంభదశయందు నాముందున్నారు. అనగా వారంతా నా యొక్క వివిధ అంశలే. ప్రతిదానికి ప్రతివారికి మూలము నేనే. అనంతమైన శాఖోపశాఖలు నానుండి వ్యాప్తిచెందును. మీలోని ప్రతి ఒక్కరి కొరకు మీ ద్వారా పనిచేస్తూ మీలో అనుభవిస్తున్నాను.

నా యొక్క ఆనందము, అనంతమైన జ్ఞానశక్తి నన్నా బాధలను తట్టుకొనునట్లు చేయుచున్నవి. అనూహ్యామైన సంఘటనలు నా భారమును తగ్గించుచున్నవి.

ఎల్లప్పుడు నన్ను గురించి ధ్యానింపుడు. మీ ప్రతియత్నములోను సంతోషముతో వుండుడు. నేనెప్పుడు మీకు రక్షగా వుందును.

# 32. ఆ పాటను నేనే

నేను అంతటికి, అన్నిటికి ఆవలనుందును. ఇట్టి స్థితి వల్ల నేను సమాంతరముగా నేనే సర్వమని, సమస్తమునకు అతీతుడనని భావించెదను. నేనే పాటను. ఆ గీతమందలి మాటలు నేనే. శ్రావ్యమైన స్వరము నేనే. పాడేవాళ్లు, వాయిద్యాలు శ్రోతలు కూడా నేనే. అయినప్పటికి మీ స్థాయిలో మీకు అర్థమగుటకు గాయకుడు పాట అయిన నేనంటే ఎవరో విపులంగా చెప్పుతున్నాను.



## 33. అనంతజ్ఞానము

సర్వాంతర్యామియైన దైవము చెంత దాచవలసినదేదియు లేదు. ఏలనన అయన అంతట కలడు కనుక. సహజముగా జరిగిన దేమనగా ఆయనముందు దాయవలసినదేదియు లేనప్పుడు, అట్టి ఆయన తప్పనిసరిగా సర్వమూ తెలిసినవాడై యుండవలెను. అందరిని ఎరిగినవాడై యుండవలెను.

అనంత జ్ఞానమనగా సమస్తమును ఏక కాలంలో ఒకే పర్యాయము చూడగలుగుట. అట్టి అనంతజ్ఞానము ఆద్యంతములు లేనిది. అగోచరమైనది. శాశ్వతమైనది. దీనితో సరితూగేది, కలిసేది మరేదీ లేదు. దీనినుండి వేరుచేయకలిగినది ఏదీ లేదు.

ఇట్టి జ్ఞానము, లెక్కలేనన్ని అనేక సంత్సరాల క్రితం జరిగిన విషయాన్ని కూడ జ్ఞప్తియందుండునట్లు భగవంతునికి కలుగజేయును. ఇంకనూ లెక్కలేనన్ని అనేక రాబోవు సంవత్సరములలో జరుగబోవుదానిని ఎరుకపరుచును. అట్టి జ్ఞానము సమస్తము భగవంతుని ఎరుకయందుంచును. ప్రస్తుత వర్తమానమందుంచును. అది సద్గురువులు అవతారుల జ్ఞానము.

మీకు అర్థమగునట్లు చెప్పవలయునన్నచో యుగయుగాలలో జరిగినదంతా నాకు తెలుసు. మీరెన్నిరకముల జీవితములు గడిపితిరో నేనెరుగుదును. రానున్న అనేక యుగములందు మీరు ఏ ఏ జన్మలు ధరించనున్నారో ఆ క్షణమేదో కూడ నేనెరుగుదును.

## 34. విశ్వాత్మక శరీరము (విశ్వ రూపము)

భగవంతుని లీలా విలాస ప్రభావము చేత విశ్వాత్మక మనస్సు, విశ్వాత్మక శక్తి, విశ్వాత్మక శరీరము ప్రస్ఫుటితమై వానియందు సర్వము యొక్క వ్యక్తిగత ఆత్మ, శక్తి మరియుశరీరము యీ సమస్త సృష్టిలో అభావముగా గోచరించును.

ఇట్లు భగవంతుడు తన లీలావిలాస ప్రభావము చేత విశ్వాత్మక మనసు, శక్తి, శరీరముతో శాశ్వత సర్వవ్యాపకమైన అనంతమందే శూన్యము, అభావముగానవతరించును. ఈ క్రమమున భగవల్లీల మిధ్య అనే శూన్యమును సృజించును. వ్యక్తిగత ఆత్మలు, శక్తులు శరీరములకు ఉనికి లేదు మరియు శరీరములు, సూక్ష్మ శరీరములు అవన్నీ మిధ్యలో శూన్యస్థానము కలిగియుండును.

ఈ సృష్టిలో సమస్త జీవనిర్జీవరాసులు, స్థూల శరీరములన్నీ నా విశ్వాత్మక శరీరము నుండియే ఉద్భవించుచున్నవి. వ్యక్తిగత మనోమయ శరీరములు నా విశ్వాత్మ శక్తి, మనస్సుల నుండి వుద్భవించినవి. విశ్వాత్మక శక్తి, విశ్వాత్మక మనస్సుల శుభ్య ఏమాత్రము అభావములు లేవు.

అపారపారావారములోని ఇచ్చటి బిందువుకు అచ్చటి బిందువుకు భేదమేమియు లేదు. కారణమేమనగా మహాసాగరమందలి ప్రతి జలబిందువు పరిమితమగు సర్వమేయైనా ఆ మహాసాగర బిందువుల సముదాయము అనంతములోని అంతర్భాగమే. అనంతజలమయమైన మహాసముద్రమున బిందువులు అనే మాటే లేదు. అంతయు ఒక్కటియే. అనంత మహాసాగరమందలి ఏ ఒక్క జలబిందువైనా అట్టి సముద్రపు లక్షణములే కలిగివుండి అందలి అంతరాంతరపు అంతర్భాగము కంటె వేరుగా ఉండదు.

పరమాత్మలో అంతరములు లేవు. ఉన్నది ఒకే ఒక అనంత మహాసాగరమనే సత్యము. దీనికి సృష్టి స్థితిలయములనునవి లేవు. సత్యమగు దీని నిత్యత్వము నందు శాశ్వతము, అనంతము అవిభాజ్యమునగు సత్పదార్థము కలదు.

## 35. త్రుటిమాత్రములో సమస్తము ఎరుగుట

నేను సమస్తమునెట్లు తెలుసుకొందును? సృష్టి యొక్క అనంతమైన, దుర్గ్రాహ్యమైన యీ విశ్వము ఒక అనంతమైన, స్వల్ప మాత్రమైనది. కానీ దీనిని గ్రహించవలెనన్న అర్థము చేసుకొనవలయునన్ననూ అతికష్టతరమైనది. విశ్వజనీన

మనస్సు. అంటే ఏమిటో నీవు అర్థము చేసుకొనిననాడు విశ్వశక్తి, విశ్వరూపము అంటే ఏమిటో తెలుసుకొనిననాడు మరియు వాటికి వ్యక్తిగత మనస్సు శక్తి, శరీరములతో గల సంబంధమును, సద్గురువులు సమస్తము తెలుసుకొనగలిగిన చందమున గ్రహించగల్గుదువు.

ఇట్టి విజ్ఞానము ఒక తృటిలో పొందవచ్చును. కానీ సమస్తము ఒక తృటిలో అవగాహన చేసుకొనవలయునన్నచో, యీ మాయా వరణమందు, అది నిత్యమై క్రమముగా నీ అవసాన కాలము దరిచేరును. ఇక్కడ అవసానకాలమనగా నీకై నీవు మరణించుట. నీకై నీవు మరణించుట అనగా నీకు నీవే భగవంతుడవని గ్రహించి నీలోని స్వార్థములు పరిత్యజించి ఆత్మ సాక్షాత్కారమును పొందుట అన్నమాట.

ఈ రకమైన అహంకారమును రహితము చేయుట సామాన్యముగా అంత శులభ విషయము మాత్రము కాదు. అది మరణించిన దేహాన్ని జీవింపచేయుటకు చిన్న పిల్లవాడు చేసే ప్రయత్నమువంటిది.

## 36. తెలుసుకొనుట మరియు తెలుసుకొనలేకపోవుట

అత్యున్నతుడనై మరియు అత్యల్పుడనై నేనే జ్ఞానాన్ని సృష్టించి అదే సమయములో అజ్ఞానాన్ని కూడ స్వీకరిస్తున్నాను.

ఒకానొక సంఘటన ఒక నెలలో జరుగనున్నదని నాకు తెలిసినప్పటికి అదికొన్ని సంవత్సరముల వరకు జరుగదని భావించి, అనేక ప్రణాళికలు వేస్తూ వుంటాను. తిరగి ఒక విషయము కొన్ని సంవత్సరముల వరకు జరుగదని తెలిసికూడ అది మరుక్షణములో జరుగునట్లుగా నేను కనపడుదును.

జ్ఞానములోనే అజ్ఞానము మిళితమైయున్నది. కానీ అజ్ఞానములో మాత్రము జ్ఞానముండదు. అత్యున్నత స్థితిలో అనంతజ్ఞానము కలిగియుండి, మీ స్థితిలో సంపూర్ణ అజ్ఞానాన్ని పొందుతున్నాను. నేను అనంతజ్ఞాన స్వరూపుడను.

అందుచేత కొన్ని వందల సంవత్సరములు తరువాత జరుగబోయేది కూడ నేనెరుగుదును. అయినప్పటికి నేను మీ స్థితియందున్నప్పుడు అజ్ఞానమునే ప్రకటించుదును.

స్థూల భూమిక యందు, మామూలు పరిస్థితులలో జ్ఞానము, అజ్ఞానము రెండునూ ఒకే పర్యాయము సృష్టించబడును. ఉదాహరణకు నీవు నేను ఈదుట ఎరుగనని చెప్పెదవను కొనుము. ఇందలి గూడార్థము, ఈదుట ఎట్లు అనే విషయము నీకు తెలియదు అనే విషయమునీకు తెలియును. నీకు తెలియదు అనే విషయము నీకు తెలుసుగదా! అలాంటి జ్ఞానము నీకు వుండనిచో, నీకు ఈ "నాకు తెలియదు" అనే విషయము నీకు తెలిసియుండెడిది కాదు. ఇదే జ్ఞానము యొక్క అజ్ఞానము.

అదే మాదిరిగా, కేవలము జ్ఞానమే ఐననేను అజ్ఞానముయొక్క జ్ఞానమును సృష్టిస్తాను. సమస్తము తెలిసిన నేను, ఏమి తెలియని వాని వలె కనపడతాను మరియు సమస్తము తెలిసిన వాని వలె కూడా కనిపిస్తాను.

## 37. ఇచ్ఛ మరియు బాధ

ద్వంద్వమందే ఎడబాటున్నది. యెడబాటు భయముకు మూలము. భయము దుఃఖహేతువు.

ఏకత్వము సుఖమయ మార్గము. అనేకత్వము దుఃఖ పూరిత మార్గము.

ద్వంద్వత్వములేని ఒకే ఒక్కడిని నేనే. అందువల్ల శాశ్వతానందమును పొందుతున్నాను. నీవు స్వార్థము నుండి వేరుపడతావు. అందువల్ల నీవు ఎల్లప్పుడు దుఃఖముతో వుంటావు.

నీ దృష్టిలో, నీవు చూచేదంతా నిజంగా సత్యమే కానీ నాకు అది అంతా అసత్యము.

నేను మాత్రమే సత్యము. ఈ మాయా లోకాన్ని పరిపాలించేది నా ఇచ్ఛ. నా ఇచ్ఛలేకుండా, అలలు కదలవు , గాలి వీచదు, నేను చెప్పేది పరమ సత్యము.

నాఇచ్ఛ యందు నీకున్న నమ్మకము అత్యున్నత స్థాయికి చేరిన మరుక్షణము, నీలోని దుఃఖములకు శాశ్వతముగా స్వస్తి పలుకుతావు. అప్పుడు గతములో నీవు పొందిన సుఖ దుఃఖములు భవిష్యత్తులో నీవు పొందబోయే అనుభవములు, ఇవన్నీ కూడ ప్రేమ పూరిత, అనురాగయుతమైన నాఇచ్ఛయే. అట్టి నాఇచ్ఛ నీయందు వర్షించబడినప్పుడు, నిన్ను తిరిగి దుఃఖ సముద్రమున వుంచు శక్తి మరేదీ లేనే లేదు.

వర్తమానమందు ఇంకా ఇంకా జీవించుము అది, భూత భవిష్యత్తుల కంటె ఆనందదాయకమైనది.

నీవు ఒకవేళ బాధలలో వున్నా, దాని గురించి ఆలోచించక నన్నే జ్ఞప్తి యందుంచుకొనుము. ఇట్టి ఆలోచన దుఃఖనాశన హేతువగును.

నన్ను గురించి సుదీర్ఘముగా ఆలోచించుము. అప్పుడు నీ బాధలన్నీ కనుమరుగై, శూన్యములో కలిసిపోతాయి. నాఇచ్ఛ నిన్నా స్థితికి చేర్చుటకు, నిన్ను మేల్కొల్పును.

## 38. నా హృదయము పై హాశ్యము

నేను సర్వోన్నతుడనైనటులనే, జ్ఞాన సంపన్నుడను కూడ. అయినప్పటికి ఏ అవివేకి చేయని విధంగా, నేను అప్పుడప్పుడు అవివేకమైన పనులు చేస్తూ వుంటాను. ఈ అవివేకమైన పని ఏమిటంటారు? జగత్తును సృష్టించుట.

నిజంగా సృష్టించుట ఒక తమాషా. కానీ యీ హాశ్యము నా స్వకీయమైనది. ఇట్టి హాశ్య ధోరణి నా హృదయముపై భారమగుచున్నది. ఒక్కొక్కప్పుడు నేను అలసిపోతున్నాను. 700 సంవత్సరములు వరకు నిదురించవలయునని భావిస్తూ వుంటాను.

అవివేకికి, అవివేకమైన చర్య అతి సహజమైనది. అతనుదాని కొరకై ప్రయత్నించ నవుసరము లేదు. కానీ విజ్ఞాన సంపన్నుడైన భగవంతుడు, తన విజ్ఞానమునకు వ్యతిరేకముగా ఎంత కష్టపడి, పనిచేయునో నీవూహించ లేవు. అందువలననే నేను చెప్పే పదము నేను అలసిపోయాను, అని అన్నప్పుడు దాని అర్థము మీరు గ్రహించలేరు. మానవుని జ్ఞాన దృష్టి కది అతీతమైనది.

# 41. సత్యము, మాయల సంధిలో

నేనింతవరకు చెపుతున్న సమయమాసన్నమయినది. విశ్వకార్యము నాపై అనంతభారము మోపుచున్నది. అజ్ఞానమునకు మూలమైన మాయ, సంపూర్ణ శక్తివంతమై నా కార్యమునకడ్డు తగులుతున్నది. అందువలన ప్రత్యేకముగా నాకు సన్నిహితులైనవారు కడుజాగరూకులై మసలవలయును. మీ యందు నాకు గల ప్రేమ తెలిసి, మీలోని బలహీనతలను వుపయోగించు కొనుటకు మాయ కాచుకొని యున్నది. మీరు నా ఆజ్ఞలను ఉల్లంఘించిన మరుక్షణము మాయ యొక్క అవసరము నెరవేరును. అంతట నేను మాయతో సంగ్రామమే చేయవలసివచ్చును. ఎందుకు? దానిని నాశనము చేయుటకు గాదు. కాని మీకు దాని శూన్యత్వమును బోధపరచుటకు అట్లు చేయుదును. మీరు నాయందు విధేయతను కోల్పోయిన మరుక్షణములో మాయ మిమ్ములను గట్టిగా బంధించి మిమ్ములనావహించును. అప్పుడు మీకు వప్పగించిన విధులను నెరవేర్చుట నుల్లంఘింతురు. అప్పుడది నా బాధలకు తోడగును.

భగవంతునియందు తికమకలు లేవు. భగవంతుడు అనంతమైన ఆనందసాగరుడు. మాయయందు తికమకలకు స్థానమున్నది. ఇది కడుదుఃఖ భాజనమైనస్థితికి అలవాలము. మానవులకు ఆర్త త్రాణ పరాయణుడు శాశ్వ తుడు అయిన నేను వాస్తవము, అవాస్తవముల సంధియందున్నాను. అదే సమయములో వాస్తవము యొక్క అనంత ఆనందమును, మాయ యొక్క బాధను ఏకకాలంలో అనుభవిస్తున్నాను.

ఒకవైపు సత్యముతోను మరియొక వైపు మాయతోను లాగబడి వాటి ప్రభావమును రెండువైపుల అనుభవింతును. ఇదే నా యొక్క శిలువ. నీవొకసారి మాయయందు జారిపడితివో శూన్యముల యొక్క బలమధికమై నిన్ను గుంజుట మొదలిడును. అందుచేత నేను దాని శక్తినెదుర్కొనుటకు అధిక శ్రమ పడవలసివచ్చును. అందువలననే నాసంధియందు స్థిరపడవలసి వచ్చును. సత్యము యెడల నాకున్న ఆధారమును నేనెన్నడు వదలుకొనను. శూన్యము యొక్క శక్తి ప్రభావము ఎంతగా పెరిగి పెనగులాడునో నా హస్త ప్రభావమంత బలీయమగును. అయినప్పటికి నేను యధాస్థానమందే యుందును.

# 42. నా శిరో కేంద్రము




కుతుబ్ యొక్క వ్యావహారిక అర్థము, రథసారథి లేదా అతిముఖ్యమైన ఇరుసు (ఆధారము) అని అర్థము. అట్లే ఈ సృష్టిలో పరిభ్రమించే సర్వమునకు ఆధారము కుతుబ్ (సద్గురువు) అగును. సర్వమునకు ఆయన కేంద్రమై, అన్ని భూమికలందలి సమస్తము ఆయనకు సమ దూరమందుండును.

వేర్వేరు భూమికలందు జ్ఞానావస్థయందలి వివిధ బిందువులు లేక వ్యక్తిగత స్థానములందు నీ వల్ల జనించు పనులు, భావ ప్రకటనలలో పరిమితమైయుండును. కాని సర్వసృష్టికి కేంద్రమైన నేను, సర్వమునకాధార భూతుడను కనుక నా యొక్క ప్రతి కదలిక, దాని చర్యలో గాని, ప్రతి క్రియలో గాని, ప్రకటనలో గాని, ఫలితములో గాని అనంతమై, అపరిమితమైయుండును.

ఉదాహరణకు నీ శిరము నందలి ఒక కేంద్రము, అనేక ప్రశ్నలకు జవాబుగా, అనేక జవాబులు, అనేక పనులు నిర్వర్తించును. నేను సుఖముగా వున్నాను, నేను కడు కష్టములలో వున్నాను. నేను భుజించాను, నేను విశ్రాంతి తీసుకున్నాను. వగైరా వగైరాలన్నీ నీ మనస్సుకు తెలిపిన జవాబులు. వివిధ ప్రశ్నల పరంపరలకు వివిధ పర్యాయములు తెలిపిన జవాబులు. కానీ సృష్టి

అనంతమైన చైతన్యావస్థ యందలి లక్షణమే అచైతన్య స్థితి. అనగా అచైతన్య స్థితి, చైతన్యావస్థ యందంతర్భాగమే. అట్టి చైతన్యావస్థ అచైతన్య స్థితిని రూపుమాపుటకొరకై దానిని భరించి, తనయందే ఇముడ్చుకొనును. తనయందే ఓలలాడించును. దానిని పూర్తిగ ఆవహించి యుండును.

నేనే అనంతచైతన్య స్థితిని గాన, నేను అనంత చైతన్యమని ప్రకటించుదును. నేనన్నిట నున్నాను మరియు అంతటికి అన్నిటికావల గూడ నున్నాను.

నేను, నీవేనని నాకు ఎల్లప్పుడు తెలియును. కానీ, నేనే నీయందున్నానన్న చైతన్యము నీకు లేదు. నిత్యము నేను నిన్ను బలపరచుచున్నాను. నీ చైతన్యమందు భాగము పంచుకొనుచున్నాను. ఇప్పుడు నేను మిమ్ములను కోరునది ఒక్కటియే. నన్ను విడువక గట్టిగా పట్టుకొనుడు. అట్లున్నచో ఏదో ఒకనాటికి మీరే నా చైతన్యమందలి భాగమును పొందగలరు.

మానవునిగా, అచైతన్య స్థితి కలిగియుండుటలో బహిర్గతమయ్యేది ఏమనగా అంతములేని అనంతచైతన్యానుభూతి పొందుటయే! అనగా సర్వము (భగవంతుడు) పరమాత్మయే. తక్కినదంతా మిధ్య. సర్వమూ, సర్వాంతర్యామియే. వాయువున్నది. జలమున్నది. భూమియున్నది. వెలుతురున్నది. చీకటున్నది. పాషాణమున్నది. లోహమున్నది. వృక్ష సంపద యున్నది. కీటకమున్నది. మత్స్యమున్నది. పక్షి వున్నది. జంతువున్నది. మానవుడున్నాడు. దైవమున్నాడు. చెడువున్నది. బాధవున్నది. ఆనందమున్నది. వుండేదానికంతము లేదు. శూన్యము చేరినకాని, వుండేదంతయు మిధ్యయని యెరిగి దైవమొక్కడే యున్నాడని గ్రహించగలరు.

మానవునికి భగవంతుడున్నాడని ఒప్పుకొనుట అంత సులభముగాదు. ఒకవేళ అతడు భగవంతుడున్నాడని ఒప్పుకొనిననూ, ఆ ఒప్పుకొనిన దానిని నిర్ధారించుకొనుట అనగా దైవమును గాంచుట అంత సులభమైన విషయము కాదు. సాక్షాత్కారము పొందుట ఎంతో కష్టమైన పని. సాక్షాత్కారము పొందుటయనగా తాను మానవుడి నన్న భావన పొందుటకంటే తానే భగవంతుడినని తానే భగవంతుడిగా ఉండెనని ఎప్పటికి తానే భగవంతుడినన్న పూర్తి చైతన్యాన్ని ఎరుకతో కలిగియుండుట.

తెలిసిగాని, తెలియకగాని, మానవుడు తన గమ్యమైన, నిజ ఆత్మను సదా అన్వేషిస్తున్నాడు. మానవునికి అతి సమీపమైనది, అంతరాంతర మందుండునది - తన ఆత్మ. కానీ విశేషమేమనగా, తాను తన ఆత్మకెంతో సుదూరతీర మందున్నట్లు భావించును. అసలు, నిజానికి దానిని సమీపించుటకేమి దూరము లేకున్నను దానికెంతో దూరమందున్నట్లు భావించుట వలన తన గ్యమును చేరుటకు చావు పుట్టుకలనే అంతములేని రాచబాటలు, కాలిబాటలు దాటి జీవుడు అనంతమైన ప్రయాణము చేయవలసి వచ్చుచున్నది. మానవునిగా పూర్తి చైతన్యము పొందిన తరువాత అనగా తన గమ్యము చేరిన తరువాత తన ఆత్మ చైతన్య స్థితిని గ్రహించగల శక్తిని సమకూర్చుకొనును. అయినప్పటికి ఆతడు దివ్య వైభవమును కాంచలేకున్నాడు. కారణమేమనగా తన చైతన్యము, అతనియందు అంతర్గతమైన, పరిమితమైన సంకుచిత ఆత్మ పైననే కేంద్రీకరించును-అదే మనస్సు. దీనివలననే చైతన్యము పొందవలసి యున్నది.

తానెవరో తెలుసుకొనుటకు ముందు, అచైతన్యము నుండి చైతన్యవంత మగుటకు చేయు ప్రయాణములో తాను వహించు అధిక భారమనే మిధ్యా జ్ఞానమును తెలుసుకొనకుండ తనను తాను తెలుసుకొనలేడు. అట్టి జ్ఞాన సముపార్జన ప్రేమ ద్వారా మాత్రమే సాధ్యపడును. క్రమేపీ నీకు తెలియనిదేదో దానిని విడిచిపుచ్చుదువు. దైవ ప్రేమ మిధ్యా ప్రపంచమంతట ఆవహించి యున్నది అయినా భగవత్ప్రేమను మాయ ఎంతమాత్రం మరుగుపరచ జాలదు. నీవు ప్రేమించలేని వారిని సైతం ప్రేమిస్తూ భగవంతుని ప్రేమించుట ప్రారంభించుము. ఇతరులకు సహాయపడినచో నీకు నీవు సహాయపడినట్లగును. నీవు ఇతరులను ఎంతగా దయ, ధాతృత్వముతో గుర్తుంచుకొందువో, నీలోని స్వార్థమునంత తక్కువగా గుర్తించెదవు. నిన్ను నీవు ఎప్పుడు సంపూర్తిగా మరిచెదవో ఆ మరుక్షణమే నన్ను ప్రేమకు మూలముగా గ్రహింతువు.

అన్ని రకములైన కపటవర్తనమును వదలివేయుము. ఏదైతే న్యాయమో అట్టి న్యాయమాచరించుట, ఏది వాస్తవమో అట్టి వాస్తవమును ఆచరించుటకు

వెలువరించినప్పుడు అనంతమైన జ్ఞానము బయల్వెడలును.

ఒక ఆటంబాంబు ఈ పృధ్విని తాకినప్పుడు, అది సర్వ నాశనమును కలుగజేయును. అటులనే, నా ప్రథమ ప్రేరణమైన వాక్కు నా నుండి వెలువడి జగత్తును తాకినప్పుడు భౌతకంగా అహంకార నాశనముతో పాటు బ్రహ్మాండమైన ఆధ్యాత్మిక సంచలనము కలిగి మానవులు దైవసాన్నిధ్యము పొందుటకు అతృత చెందెదరు.

## 46. గుర్తుంచుకొని మరచిన పరమాత్మ

నేను రాముడను. నేను కృష్ణుడను. ఇదీ అదీ అననేల సర్వమూ నేనే. యిప్పుడు నేను మెహెర్‌బాబాను. రక్తమాంస యుతమైన యీ శరీరములో వున్న నేను ఆ పురాణ పురుషుడను. ఎవరైతే సదా కొలువబడుతూ, విస్మరించబడుచున్నాడో, ఎవరైతే శాశ్వతముగా గుర్తుంచుకొనబడి, పూర్తిగా మరువ బడుచున్నాడో ఆ దైవమే నేను.

ఎవరి గతవైభవమును ధ్యానిస్తూ జ్ఞప్తియందుంచు కొనుచున్నారో అపురాణ పురుషుడను నేనే. ఎవరి వర్తమానాన్ని విస్మరించి, మరచిపోయారో, కోరికలతో, సతమతమవుతూ ఎవరి భవిష్యత్తును (అవతరణ) గూర్చి ఆరాధిస్తున్నారో అసనాతనుడను కూడ నేనే.

## 47. ప్రశ్న దాని జవాబు

ఒకే ప్రశ్న వున్నది. ఆ ప్రశ్నకు నీవు జవాబు చెప్పిననాడు, ఇక అడుగ వలసినవి వుండవు. ఆ ఒక్క ప్రశ్నయే అసలైన సహజ ప్రశ్న. ఆ ఒక్క అసలు ప్రశ్నకు ఒకే ఒక్క చివరి జవాబు కలదు. కాని ఆ ప్రశ్న జవాబుల మధ్య లెక్కలేనన్ని అసత్య జవాబులు కలవు.

అనంతము, అభేద్యమైన అగాధమునుండి "నేనెవరిని?" అను ప్రశ్న ఉద్భవించును. అందుకు బదులుగా వచ్చు ఒకే ఒక జవాబు "నేను భగవంతుడను!

భగవంతుడు అనంతుడు. ఆయన ఛాయ కూడ అనంతమైనదే. అందలి ఏకత్వములో సత్యము అనంతమైయున్నది. అందలి అనేక త్వములో మాయ అనంతమైనది. శూన్యమందలి అనంత అభావములో తన సహజ సిద్ధమైన శబ్ద తరంగములను కృత్రిమ పరుస్తూ కూడా అనంత భావనా తరంగ భూయిష్టమైన జవాబుల పరంపరలో ఘూర్ణిల్లే ఏకత్వమునుండి ఒకే ఒక ప్రశ్న ఉదయించును.

ఒకే ఒక మూల ప్రశ్న దానికి ఒకే ఒక మూల జవాబు. సహజమైన వాస్తవ ప్రశ్నకు, వాస్తవ జవాబుకు మధ్య అనంతమైన అసత్య జవాబులనేకమున్నవి.

అట్టి అవాస్తవ జవాబు లేవనగా - నేను పాషాణమును, నేను పక్షిని, నేను జంతువును, నేను మానవుడను. నేను స్త్రీని, నేను గొప్పవాడిని, నేను చిన్నవాడిని, యీ మొదలుగా గల వన్నియు అవాస్తవ జవాబులే. యిట్టి ప్రశ్నలుదయించిన పిమ్మట, వాటిని పరిశీలించి అనుభవిస్తూ చివరకు సరియైన జవాబు - నేను భగవంతుడను అను జవాబు వచ్చినప్పుడు తక్కినవన్నియు విసర్జించబడును.

## 48. శాతములు

అన్న భూమిక - దైవము 100%. దైవత్వము 1%.

తానెవరో తెలుసుకొనవలెననే ఆపేక్ష మెండు.

(ఆత్మ సాక్షాత్కారము కావాలన్న కోరిక)

ప్రాణ భూమిక - దైవము 100%. దైవత్వము 25%.

తానెవరో తెలుసుకొనవలెననే జిజ్ఞాస.

(ఆత్మ సాక్షాత్కారము నందు వుత్సాహము)

మనో భూమిక - దైవము 100%. దైవత్వము 50%.

ఆత్మసాక్షాత్కారము ద్వారా వెలుగునుగాంచుట.

విజ్ఞాన భూమిక - దైవము 100%. దైవత్వము 100%.

ఆత్మ సాక్షాత్కారము పొందుట.

నుండి మానవుని వరకు సమ్మిళితమై యున్నది

"సి" యందు బహుకొద్ది పరిమిత, సూక్ష్మ జ్ఞానాత్మలున్నవి.

"డి" యందు బహుకొద్ది మనోమయ జ్ఞాన ఆత్మలున్నవి.

"ఇ" యందు ఇంకా తక్కువ. భగవత్సాక్షాత్కారము పొందిన ఆత్మలున్నవి.

"యఫ్" నందు పంచ సద్గురువులు, జీవన్ముక్తులు, పరమహంసలు వుందురు.

## 50. ఏకము మరియు సున్న

ఒకటి సత్యపదార్థము




భగవంతుడంటే సాధారణముగా సర్వము తానేనని, ఏకమని చెప్పబడును. మనము ఈ ఏకమనే ఒకటి సంఖ్యను అందుకు భిన్నముగా అనేకమునకు

వ్యతిరేకపదమైన ఒకటిగా వాడుతాము. ఆ ఒకటినే మనము సత్యస్వరూపమైన భగవంతు డంటాము. అనేకమైన ఆ ఒకటికి వ్యతిరేక పదమునే శూన్యము లేక సృష్టియందురు.

గట్టిగా చెప్పవలయునన్నచో ఒకటే గాదు ఏ సంఖ్య కూడ అగోచరమైన రెండవసాటిలేని ఆ ఏకత్వమైన ఒకే ఒకటిని గురించి వివరించగలది మరియొకటి లేదు. అసలు దీనిని ఒకటి అని పిలుచుట గూడ శుద్ధ తప్పు. అది సరియైన భావన కాదు. మహా సముద్రమును మనము ఒకటి అని చెప్పుతాము గదా! అట్లే యీ ఒకటి కూడ ఒక మహా సముద్రము. ఆ ఒకటి మాత్రమే వున్నది. తక్కినదంతా మిధ్య. కనబడునదంతా శూన్యమే.

ఆ ఏకమే పరబ్రహ్మ పరమాత్మ స్థితి. యీ స్థితి అనంత మహాసాగరము. ఇందు నిరాలంబమగు అనంతాకాశము లేక శూన్యమున్నది. యీ సర్వమయ అనంతాకాశమనే ఏకత్వములో చైతన్యము, జడత్వము మున్నగు భగవత్ లక్షణములు శూన్యముగా సున్నలుగా యిమిడియున్నవి. అనగా ఈ సర్వములో శూన్యము చేరియున్నది. మాయ ఒక సున్న. ఈ సున్నలో వూహాజనితములైన అనేక స్వస్వరూపములనే సున్నాలిమిడియున్నవి. యీ సున్నలకు ప్రత్యేక విలువలేమియు లేవు. ఆ సనాతనునితో వారికున్న సన్నిహితత్వము చేత భావించే అసత్య విలువ మాత్రమే చూచువారికి ద్యోతకమగును. వాస్తవముగా యీ సున్నలకు అసలు ఉనికియే లేదు. అవి వూహా జనిత రూపములు. బ్రహ్మాండమైన సున్న అనే మాయ (శూన్యము) లో వాటి వునికి కేవలము ఊహా మాత్రముగా కనబడుటయే కాని వాటికి వునికి నిజముగా లేదు. అనగా యీ సృష్టంతా మిధ్య ఉండేది పరమాత్మ ఒక్కడు మాత్రమే.

# 51. అసలైన నిరాలంబ శూన్యము

సత్యజనిత నిరాలంబ శూన్యము




అసలైన వాస్తవ సర్వము అనంతమైనది. శాశ్వతమైనది. సర్వవ్యాప్తమై, ఆ సర్వమందు వాస్తవమైన నిరాలంబ శూన్యత్వము నిక్షిప్తమైయున్నది. శూన్యము, సర్వము యొక్క ఛాయయైయున్నది.

సత్య పదార్థమనంతమై, శాశ్వతమై యుండుటవలన, దాని ఛాయ కూడ అనంతము, శాశ్వతమునై యున్నది. ఒక్కొక్కప్పుడు అట్టి ఛాయను, పెద్ద సైజులో వుండునట్లు సాగదీయబడును. అది దృగ్గోచరమైపోవునపుడు కూడ అది సత్యపదార్థమందే సంలీనమై యుండును.

సర్వమందు సంక్షిప్తమైయున్న శూన్యము, అనంతము, శాశ్వతమునైన శూన్యత్వమునే ప్రసరింపజేయును. అదే అనంతమైన సృష్టి లేక అవాస్తవ శూన్యత్వము.

సత్య జనిత సర్వస్వము ఒక్కటి మాత్రమే. అది శాశ్వతము. అనంతము. సత్యజనిత శూన్యము, సత్యజనిత సర్వస్వములో నిక్షిప్తమైన ఏక పదార్థమే.

ఇదియును శాశ్వతము, అనంతమునైయుండును. కానీ వాస్తవమైన శూన్యము నుండి ప్రసరింపబడిన అవాస్తవమైన సర్వము యీ జగత్సృష్టిలోని సర్వస్వము లేక అనంత శూన్యములు కలిగియుండి సహజ జనితమై, అంతము లేని ద్వంద్వముగా ప్రభవింపబడును.

ఇట్టి ద్వందమయమైన శూన్యములందు పుంఖాను పుంఖములైన తాత్కాలిక శూన్యములుండును. అవి యెట్లనగా నీతో వున్న పనియేమిటి? అని ప్రశ్నించినపుడు వచ్చు జవాబు ఏమీలేదు అని (ప్ర.) నీవు ఏమి తిన్నావు? (జ) ఏమి తినలేదు. (ప్ర) నీ చేతిలో ఏమి వున్నది? (జ) ఏమియు లేదు. (ప్ర) నీవు ఏమి చూచుచున్నావు? (జ) ఏమియు లేదు. యీ విధముగా ఆలోచించినచో చర్య ప్రతిచర్యలు వాటివలన పొందే శూన్యము యొక్క అనుభవములకు అంతము లేదు. అనంతమైన నిరాలంబ పరమ సత్య శూన్యమనే ఏకత్వము నుండి నిరంతరాయముగా ప్రజ్వరిల్లే అనేక శూన్యముల యొక్క అవాస్తవ శూన్యము పరిఢవిల్లుచుండును.

సహజ వాస్తవ సర్వము శాశ్వతము, అనంతమునైయున్నది. దీనియందు సహజ నిరాలంబ శూన్యం ఇమిడియున్నది. అగోచరమైన శూన్యములు ఏకత్వమనే యీ సహజ నిరాలంబ శూన్యము నుండి అవతరించును. ఇట్టి శూన్యముల నుండి తాత్కాలిక శూన్యములు సంతత ధారగా సదా ఉద్భవించుచుండును. అందువలన శూన్యములు, శూన్యము యొక్క శూన్యాంతరములు, సహజ నిరాలంబ శూన్యమందున్నవన్నమాట. నీవు ఒకవేళ యీ శూన్యములను ఆ సహజ నిరాలంబ శూన్యముతో పోల్చి చూచినచో, అవి నిజముగా శూన్యమని గ్రహింతువు.

సర్వమందు శూన్యమున్నది. శూన్యము లేకుండా సర్వము లేనే లేదు. సర్వమూ శూన్యమయము.

సర్వమందున్న శూన్యమే శూన్యమునకు జన్మ యిచ్చును. అదే సర్వముగా భాసిల్లును. ఎందుచేతననగా శూన్యమున్నది. కావున సర్వమున్నట్లు భాసిల్లును.

ఈ సృష్టియందలి ప్రతి కదలిక, యీ సర్వము శూన్యముల క్రీడయే గాని వేరు కాదు. అదియే సృష్టి కార్యము. ఈ సృష్టి కార్యము పరిసమాప్తమైనప్పుడు శూన్యము మిగులును. ఆ శూన్యమును పొందినప్పుడు నీవు సర్వమయ్యెదవు. అందుచేత శూన్యమే సర్వమగును. కానీ మనము సర్వమూ శూన్యమనుకుంటాము.

## 52. సృష్టి పరంపర

భగవంతుడనంతుడు, శాశ్వతుడు. ఆయన ఊహాశక్తి కూడ అనంతము, శాశ్వతము. భగవంతుని ఊహ అంతము లేనిది. ఆయన ఊహాజనితమైన యీ సృష్టి యావత్తు అంతముకాకుండా విస్తృతమవుతు పెరుగుతునే ఉంటుంది. మానవుడు తన పరిమిత ఊహతో అనంతమైన ఆయన ఊహనెట్లు గ్రహించకలడు? ఆయన యొక్క అత్యున్నత ఆలోచనా సరళి ఆయనకు, ఇది భగవంతుని వూహ అనే ఆలోచనను రానివ్వదు. దీని వెనుక నిగూఢమై యున్నదే భగవంతుని సత్యపరత్వము. నీవు భగవంతుని ఊహనే అర్థము చేసుకొనలేనప్పుడు ఆయన సత్యమును కొలవటం నీకు అంతకంటే అనంత కష్టసాధ్యమైన పనియగును.

శూన్యమయమైన అనంతాకాశములో లెక్కలేనన్ని గోళములు, సదా సృష్టింపబడి, భరింపబడి చివరకు నాశనము చేయబడుచున్నవి. ఈ సృష్టి పరంపర భగవంతుడానంద పరవశుడై వూహించుచున్నంత వరకు జరుగుచునే యుండును. భగవంతుని వూహ ఆగిపోయినప్పుడు అనగా శాశ్వత స్థితిని తిరిగి పొందినప్పుడు తన గాఢ సుషుప్తి అవస్థకు ఉపక్రమించినప్పుడు (అనగా

మానవుడు తన గాఢ నిద్రయందు పొందే కల అంతమైనప్పటి స్థితి) ఈ సృష్టి విరమింపబడి, మహా ప్రళయము సంభవించి అదే సృష్టి సర్వమూ అంతమొందును.

సృష్టి, పరిరక్షణ, అంతమొందించుట ఈనాడు అజ్ఞానముపై ఆధారపడి యున్నది. నిజానికి సృష్టి అని, అది పరిరక్షింప బడుతున్నదని, ఒకనాటికి అది అంతమొందునని చెప్పుట అజ్ఞానమే. అసలు యీ మూడు లేనే లేవు. అవి ఎప్పుడూ అసలు జరుగనే జరుగవు. పునాది లేని నక్షత్రమండలయుత శతసహస్ర భువన పరీవృతమైన అనంతాకాశమే యీ అజ్ఞానమునకు రక్ష.

అజ్ఞానమనుకొనును గదా! ఈ వినీలనీలాకాశమే సత్యమని, జరామరణములు, వార్ధక్యము, భోగభాగ్యములు, గౌరవాగౌరవములు సత్యమని భావించును.

విజ్ఞానమను కొనును గదా! ఈ శూన్యాకాశము ఒక స్వప్నము. భగవంతుడు మాత్రమే సత్యము అని అనుకొనును.

## 53. వస్తు గుణ స్వప్నము

ఈ జగత్తు యొక్క భావన, విరోధ భావము, శతృత్వము అస్థిమితము, మామూలు అసంతృప్తి. ప్రతి విషయమందు తిరుగుబాటుతనము, యివన్నీ కూడ వస్తు పరిణామము యొక్క శూన్య స్వప్నమే. వస్తు పరిణామమునకతీతమైన సత్యమును రుజువు చేయును. ఒకవేళ యీ సత్యమే లేకున్న పరిణామ క్రమములో అభివృద్ధి పొందిన కోట్లాది జీవరాసులు శాస్త్రాభివృద్ధి పొందిన మిలియన్ల కొలది వున్న మానవులు శాశ్వత తృప్తిని పొందియుండెడివారు. అత్యద్భుతమైనదైవేచ్ఛ, సామాన్య చైతన్యమునందు ప్రసరింపబడి, శాశ్వతానందము పొందును. జీవుడు యిప్పుడున్నట్టి ఫలితములు, యింతకు

ముందెన్నడు పొందలేదని అది తన ప్రతిభయేనని చింతించును. వాస్తవముగా అట్టి విస్తృతమైన అసంతృప్తి, నిస్పృహలు యింతకుముందెన్నడు లేవు. శాస్త్రము యొక్క అభయములు శూన్యమని నిర్ధారింపబడినవి. వాటి ఆకృతి కేవలం అపోహ మాత్రమే.

సత్యము మాత్రమే యదార్ధము. నిజము చెప్పవలయునన్నచో, సత్యము మాత్రమే యున్నది. తక్కిన అసత్య పదార్ధమునకు స్థానమే లేదు. కేవలము మాయ మాత్రమే మిగులును. మానవులు తమ అంతరాంతరములందు యీ సత్యము నెరుగుదురు. అయినప్పటికి ఒక్కొక్కప్పుడు మాయ యొక్క అవాస్తవ హామీలు పురస్కరించుకొని మోసపోయి సత్యమును గూర్చి ఆలోచిస్తారు. సత్యము తప్ప మరేదీ వారిని తృప్తిపరచజాలదు. ఈ అసంతృప్తి వలన కలుగు వ్యధతో విసుగుచెందుట చేత, అనంతమైన అవాస్తవ వ్యూహాజనిత క్రీడ నుండి అది బయలు వెడలును. ఇదీ యీ నాటి మానవుని సామాన్య స్థితి. నేను కూడ వ్యధ చెంది విసుగుతో వున్నాను. నేను సర్వస్వతంత్రుడనై స్వేచ్ఛ కలవాడనయ్యున్నప్పటికీ అట్లు విసుగు చెందవలసిన కారణమేమి? ఎందువలననగా బుద్ధుడు చెప్పినట్లు "నేను అనాదిగా శాశ్వత స్వేచ్ఛ గలవాడను మరియు శాశ్వతముగా కట్టుబడియుండువాడను" మానవుల సంస్కార ఫలితములు వలన నేనును కట్టుబడియుండవలసి వచ్చుచున్నది. వ్యధతో విసుగుచెంది బాధపడవలసిన కారణమేమనగా మానవుల వ్యధలు, బాధలు, విసుగులే కారణము. గొప్ప మేధావులే వారి కంతుపట్టని విజ్ఞాన సమస్యలు ఎదురైనప్పుడు నిరుత్సాహపడి భయోత్పాదులై తమ ప్రయోగ ఫలితములెక్కడ నాశనమగునో యని భయపడుదురు. అది ఎంతో కాలము వుండదు. వారు అతికష్టము మీద సత్యము మాత్రమే యున్నదని శాశ్వత సత్యమును కనుగొనిననాడు దానినే మానవులు దైవమని పిలుతురు. తెలివితేటల ద్వారాదీని దరి చేరలేము.

సామాన్య మానవుడు పదార్థ స్థితి యొక్క హామీల వైఫల్య కారణముగా

మోసగింపబడి దానితో విసుగు చెంది దైవమును నిర్లక్ష్యము చేయును. సర్వము నందు నమ్మకము కోల్పోవును. కానీ వెనువెంట కలుగు లాభమేమనగా నిజానికి తనలో అంతర్గతముగా నున్న దైవమందున్న నమ్మకము సృష్టి కారణమైన సత్యమునందున్న విధేయతను ఎన్నటికి విడువజాలడు. అతని బాహ్యానుమానము, అవిధేయతలు కేవలము మనో దౌర్బల్య ము వలననే కలుగుతాయి. అవి అతని హృదయమును తాకలేవు. పీటరు విషయములో చూడండి. అతడు క్రీస్తు ప్రభువును తిరస్కరించాడు. విసుగుదల మాత్రమే అతని మనస్సును తిరస్కరించేట్లు చేసినది. కానీ ఆతని హృదయములో, క్రీస్తు దైవమని ఆయనుండవలసిన స్థితియందున్నాడని తానెరుగును. సామాన్య మానవుడెన్నడు విధేయతను విడనాడడు. ఆతడు పర్వతమునధిరోహించు పర్వతారోహకుని పగిది కొంత దూరము వెళ్లి, శీతల తాపపు అనుభవమును పొంది, ఉచ్ఛ్వాస, నిశ్వాసలు నెరప అతికష్టమై పర్వతపాదమునకు దిగివచ్చును. కానీ ఆ శాస్త్రజ్ఞుని మనస్సు ఇంకా ఇంకా పర్వత శిఖరాగ్రము చేరుటకు తన హృదయ స్పందనము గడ్డ కట్టిపోయే వరకు పయనించును. అయినప్పటికి యిట్టి మనస్సు విశాలావరణమందు దారి తెన్ను గానక భయకంపితమై, తన అన్వేషణా ఫలితము నందు నిరాశ కలిగి తన అశక్తతను అంగీకరించి, అప్పుడు సత్య స్వరూపమైన భగవంతుని వైపు మరలును.

## 54. వర్తమానము

జ్యోతిశ్శాస్త్ర వేత్తలు కాలమును సౌరమాన సంవత్సరములలో బిలియనులు, ట్రిలియనులు (యావనులు) మొదలగు లెక్కలేనన్ని సంవత్సరములు కోట్లాది సంఖ్యలలో గుణింతురు. ఈ సంఖ్యలు కూడ వారి గణిత లెక్కలకు చాలవు. ఇంకా క్రొత్త సంఖ్యలను వారు తమ గణితములకు తయారుచేసుకొనవలసి వచ్చును.

అదే నన్నడిగితే నేను మీకు ప్రయత్నము చేసి కాలము యొక్క ఆరంభము, అంత్యము, జ్యోతిశ్శాస్త్ర గణితము ప్రకారము వివరించవలసి వస్తే శాశ్వతత్వములో కాలమునకు ఆది అంతము రెండునూ లేవు. ఆద్యంతము లెన్నడూ వుండవు అని వివరింతును.

సర్వకాలములందు ప్రతికాల ప్రమాణమునకు పూర్వకాలముండును, భవిష్యత్కాలముండును. శాశ్వతమై అంతము లేని కాలమందలి వర్తమానమనే ప్రస్తుత క్షణమునకు "నిన్న" గతించిన కాలముగ "రేపు" జరుగబోవు భవిష్యత్కాలముగా కాలము యొక్క అంచులపై ఆధారపడియుండును.

ఊహామాత్రంగా శాశ్వత స్థితియందలి వర్తమానమనే ప్రస్తుతాన్ని గూర్చి వూహించినచో అతడు అట్టి కాలమును కొలుచుటకొక కొల మానమును ఊహించగలడు. కానీ అట్టి కొలమానము వున్న సున్నలకు క్రొత్తవి చేర్చుటయో లేక కొన్ని సున్నలు చెరుపుటయో అగును కాని వేరు కాదు. గుణించలేనన్ని కోట్లాది కాలచక్ర పరిభ్రమణములు జరిగినా, కాలభ్రమణమందలి కదలిక, దాని సమయముల గూర్చిన శత సహస్రాంశపు భాగమైననూ, అనంతకాలములోని వర్తమానపు ఆద్యంతముల గూర్చిన ఆలోచన ద్యోతకము కాదు.

## 55. దైవమున్నాడు

సత్యములో వుండేది ఒక్కడే. మాయలో వుండునది అనేకత్వము. ఇట్టి తికమకకు కారణమేమిటో తెలుసా! వుండేది భగవంతుడు ఒక్కడే యైననూ, ఆయన సర్వాంతర్యామి. అనంతుడు. సర్వమూ ఆయనయే. కనుక అది గ్రహించినవానికి సత్య పథములో ఒకడే కనపడును. తెలియనివారికి మాయలో అనేకత్వము కనపడును.

న్యాయంగా చెప్పాలంటే ఒక భగవంతుడున్నాడనుటయూ తప్పే.

భగవంతుడనంతుడై సర్వము వ్యాపించియున్నాడు గనుక ఆయనను ఒక్కడేయని పిలుచుట సరిగాదు. ఒకరు భగవంతుడొక్కడే యున్నాడని చెప్పును. "భగవంతుడు" అనే పదము ఏకత్వమనే ఆ ఒక్కరి గుర్తింపుకు కల్పించిన రూపాంతరమే. వాస్తవమునకు ఆయనకు నామమే లేదు. భగవంతుడు ఒక్కడే అని చెప్పుటలోనే ద్వంద స్థితి నిగూఢమైయున్నది. అంతమాత్రము చేత చాలామంది భగవంతులున్నారని చెప్పుట పిచ్చితనము అవివేకము.

సర్వమయుడైన ఒకే ఒక పరబ్రహ్మ పరమాత్మ అనేక రకములైన విధములుగా క్రీడించి ఆనందించుచున్నాడు. ఉదాహరణకు మీలో ఒకరు కూర్చొని కళ్లు మూసుకొని ధ్యానం చేస్తూ అప్పటి ఆలోచనా పరంపరలో అనేక రూపములను సృష్టించుకొన్నారనుకోండి. ఎప్పుడైతే తానొక రూపము లేక రూపములను సృష్టించుకొనునో, ఆ వెంటనే వాటిని మనస్సుయందు పదిల పరుచుకొనును. అప్పుడు తన కన్నులను తెరుచును. ఎప్పుడైతే తన కన్నులను తెరచి జాగ్రదవస్థకు చేరునో ఆ వెంటనే అంతకుముందు తన ఆలోచనా పరంపరలో సృష్టింపబడిన వూహారూపములను స్మృతి పథము నుండి మరుగుపరుచుకొనును. అనగా వాటిని రూపుమాపును. ఈ విధముగా ఆ ఒకే వ్యక్తి అనేక విధములగు పనులు నిర్వర్తించును. ఒకటి సృష్టించుట, రెండు భరించుట మూడు వినాశము. సృష్టి కర్తగా తాననంత రూపములను సృష్టించును. భారము తానే మోయుచూ, భరించును, లయకారకుడై చివరకు మేల్కాంచిన పిదప నాశనము చేయును. ఈ విధముగా ఒకే ఒక్కడు సృష్టి స్థితిలయ కారకుడగును.

మరొకటి పరిశీలించెదము. ఒకడు గాఢ నిద్రలో వున్నాడు. ఇది భగవంతుని సహజ స్థితి. ఇట్టి వానిని మానవులు నిద్రయందున్నాడందురు. కానీ అట్టి గాఢ నిద్రయందు తాను తానుగా చైతన్య రహితుడై ఎరుగలేదు. అతడు మేల్కాంచిన పిదప మానవులు చెప్పుదురు. ఏమని? అతడు మేల్కాంచెనని. అతడు దంతధావనము చేసినప్పుడు మానవులు అంటారు గదా

- "ఆతడు తన పళ్లను తోముకుంటున్నాడు" అని ఇంకా అతడు నడుచునప్పుడు, పరుగెడుతున్నపుడు, మాట్లాడుతున్నపుడు, పాడుతున్నపుడు ఇంకా ఇంకా అతను చేయు వివిధ కలాపములు జరుగునప్పుడు మనకు గ్రాహ్యమగునది ఏమిటి? అతడు అనేక పనులు నిర్వర్తించుచున్నాడు అని విశదపడును గదా! ఇన్ని రకములగు పనులు చేయునది అతను ఒక్కడే గానీ ఒకరి కంటే ఎక్కువగాదు. ఒకే ఒక్కడు ఇన్ని పనులు వరుసగా చేయుచున్నాడు.

దీనిని బట్టి మనము మరువరాని సత్యము ఒకటియే - భగవంతుడు వున్నాడు. వకైకుడున్నాడు. అతడే సృష్టి స్థితిలయ కారకుడు.

ఇందు రెండు విషయములున్నవి. (ఒకటి) ఏకము మరియు అనేకము ఏకమును మనము భగవంతుడందుము. అనేకమును మాయ యందుము. ఎందువలన? ఎందుచేతననగా సత్యము నందు ఏకమే కలదు. దీనిని ఏకమని పిలుచుట కూడ తప్పే. ఏకమున్నదనుట సరియైనది.

## 58. అవిభాజ్యమైన ఏకత్వమును అనంత వ్యక్తిత్వము ప్రకటించుట

అవిభాజ్యమైన ఏకత్వము యొక్క అనంత అపార పారావారపు విశాల జలనిధిలోని నీటిని వేరు పరుచుట అను దానికి అవకాశము లేదు. అటులైనచో అవిభాజ్యమైన ఏకత్వము నుండి స్వతంత్ర స్థితికి ప్రత్యేకత ఎట్లుండును? అవిభాజ్యమైన, అంతము లేని, సత్యమనే మహాసాగరములోని ఒక బిందువుకు, ఆ మహాసాగరము యొక్క లక్షణములే వుండును గాని ప్రత్యేకత ఎటులుండును? ఆ బిందువు సముద్రములో కలిసియున్నంతకాలము మహాసాగరమే కానీ ఈ నీటిబొట్లు సముద్రముపై తేలు బుడగలుగా మారినప్పుడు ప్రత్యేకతత్వమును పొందుచున్నవి. ప్రతి బుద్బుదము నీటి బిందువుకొక ప్రత్యేకతను

ప్రసాదించుచున్నది. నీటిబొట్లు సముద్రములో ఏకత్వము కలిగియున్నప్పటికి, బుడగలు కల్పించిన ప్రత్యేకత వలన సముద్రము నుండి వేరుపడుచున్నవి. ఈ నీటి బొట్లు బద్ధలయిన వెంటనే ఆ నీటి బొట్లు అనంతమగు సముద్రములోనివే అని తెలిసికొనినచో అప్పుడవి జాగ్రదవస్థకు చేరి వాస్తవ స్థితిని గుర్తించి తాను మహాసాగరమని స్వతంత్ర ప్రకటన చేయును.

నీటిబిందువు మహాసముద్రము నుండి వేరై, చైతన్య స్థితిని పొందిన మరుక్షణములో చైతన్య హీనత పోయి ప్రత్యేక వ్యక్తిత్వము కలిగి అవాస్తవమైన నేను అనే పరిమిత వ్యక్తిత్వ మేర్పరుచుకొనును. ఆ బిందువుకు స్వతసిద్ధమైన అస్తిత్వము లేదు. తన ప్రతిభాష ప్రకటనలోను ప్రత్యేకతతో కూడిన చైతన్యలేశము కలుగును. అవిభాజ్యమైన మహాసాగరములో ఈ అవాస్తవమే ఆ నీటిబిందువుకు ప్రత్యేక వ్యక్తిత్వము నేర్పరుచును. ఈ అవాస్తవమే ఆ నీటి బిందువుకు స్వీయ స్మృతి. అనగా తానే మహాసాగరముఅన్న జ్ఞానమును తెలియనీయక అవరోధమును కలిగించును. తన్ను తాను తెలుసుకోవలెననెడి ప్రేరణ ఈ అస్తిత్వమునకు కదలికను బుట్టించును. ఈ ప్రేరణము మహా సముద్రములో యిమిడియున్నది. అది ప్రస్ఫుటమైనప్పుడే ఆ నీటిబిందువు తానెవరో గుర్తించి, అవాస్తవమైన తాను సముద్రమునకు వేరనే భావమును వదలును.

ఈ ప్రయాణమునందలి అంతమందు, తాను కోరిన గమ్యాన్ని చేరినప్పుడు సద్గురువు యొక్క కృప వలన, ఈ అవాస్తవపు "స్థితి" పూర్తిగా తొలగిపోవును. "నేను" అనునది మాత్రమే మిగిలియుండును. అత్యున్నత స్వీయ జ్ఞానమిదే - అనగా నా యొక్క అవాస్తవస్థితి పోయినది. నేనే భగవంతుడను అని తెలిసికొనుట !

ఈ విధముగా ప్రతి నీటిబిందువు, తాను మహా సముద్రముతో వేరన్న భావము వదలినప్పుడు, దానంతట అదే తాను అవిభక్తమగు మహాసముద్రమని ప్రకటించును. అజ్ఞాన స్థితిలో వున్న నీటి బిందువు తన్ను తాను తెలుసుకొనవలెనను చిద్విలాస ప్రేరణతో చైతన్య వంతమై, తనలోని అజ్ఞానమును

పారద్రోలి, అనంతమగు సముద్రములో శాశ్వతమగు చైతన్యమును తిరిగి పొందును. ఈ లెక్కలేని నీటిబిందువులు భ్రమ మాత్రముగా తమకు కలిగిన భిన్నత్వము ననుభవింపనంత వరకు తాము అనంతము, శాశ్వతమునగు సముద్రముతో నేకత్వము కలవేనని గ్రహింపలేవు. ఆ నీటిబిందువు చైతన్యము పొందిన తరువాత మహాసాగర తుల్యమైన పరమాత్మతో తన అవి భక్తమగు ఏకత్వమునను భవించును. భగవంతుడు అనంతుడు, పరమాత్మ అవిభాజ్యుడని గ్రహించును. ఇదే నేను భగవంతుడను అను స్థితి. ఈ విధముగా ప్రతి ఆత్మ చైతన్యమును పొంది, అజ్ఞానము విడనాడి, పరమాత్మతో అవిభాజ్యమగు ఏకత్వమును పొంది తానే పరమాత్మగా గుర్తించును.

## 57. మూడు లక్షణాలు

భగవంతుడు, చైతన్యవంతమైన మూడు లక్షణములు అనుభవిస్తున్నాడు. (1) ఆయన సహజ స్థితి. (2) నిస్సహాయ స్థితి. (3) సర్వశక్తిమయ స్థితి.

**1. సహజ స్థితి :**

భగవంతుడీ స్థితిలో చైతన్య హీనస్థితి యందు ఉండి తన అనంతశక్తి, ఆనందము, తన వునికి సర్వమును మరచును. ఈ స్థితిని మానవుని గాఢ నిద్రతో పోల్చవచ్చును.

**2. నిస్సహాయ స్థితి :**

ఈ స్థితిలో పరమాత్మ తానచేతనుడై, తాననంతుడనని విస్మరించును. మానవ శరీరములో నిస్సహాయ స్థితిని అనుభవించును. అతడు విడువకుండా ఏదో తెలియని దాని గురించి చింతించుచుండును. అతనికి శాంతి దూరమగును. అనేక అవరోధములు ఆందోళనల కారణముగా ఆయన ఎల్లప్పుడూ తన సహజ స్థితిని గూర్చే ఆలోచించుచుండును. ఇలా చేయుట వలన మందమతి ఏర్పడి

మరుపు అలవడును. అతడు సమస్తము మరువవలయునని కోరును. ఆతని నిస్సహాయ స్థితిలో మరపు వలన పొందిన మొదటి అనుభూతి, తాను పొందిన అనుభూతి, స్థూల సంస్కార సంపర్కము చేత అతనిపై ప్రబల ప్రభావము కలిగియుండును. తిరిగి తన సహజ స్థితిని పొందుటకు నిద్రావస్థ ద్వారా ప్రయత్నించును. అందువలన నిద్ర అతిముఖ్యమైన సాధనమగును.

కానీ నిద్రయందాయన అచేతనుడగుట వలన, యీ మరపుస్థితిని, జాగ్రదవస్థస్థితికి తీసుకు రాలేకున్నాడు. అందువలన ఆయన తన నిస్సహాయ స్థితికి మార్గమునన్వేషించ లేకపోతున్నాడు.

**3. సర్వశక్తిమయ స్థితి :**

రోజురోజుకు, ఆయన నిస్సహాయ స్థితి అభివృద్ధిచెందును. అది అపరిమితమైనప్పుడు సర్వశక్తిమయ స్థితిలో అంతమగును. ఈ సర్వశక్తిమయ స్థితియందు పరమాత్మ, చైతన్యముతో వుండియే సమస్తము మరచి పరిమిత వ్యక్తిత్వమును కూడ మరచి, తాను అనంతుడను, తన ఉనికి అనంతమని, తానే అనంత ఆనందమని, సర్వశక్తిమయుడనని తానెరుగును.

## 58. సత్యము పరమాత్మదైతే చట్టము మాయది

రెండు విషయాలున్నవి. ఒకటి న్యాయము, రెండు చట్టము, న్యాయము భగవంతునికి చెందినది. చట్టము మాయ సంబంధము.

మాయ అనంతమైన విశాల జగత్తు అయినప్పటికి అది చట్ట ప్రకారము పరిపాలించబడుతుంది. ఎవరూ దీనినుండి తప్పించుకోలేని లయకారకమైనదీ చట్టము.

చట్టము కర్మబంధనము. సత్యము సర్వ స్వతంత్రము చట్టము అజ్ఞానమును పరిరక్షించును. సత్యము వాస్తవమును రక్షించును. చట్టము

నిన్ను మాయకు కట్టుబడియుంచు వూహలను పుట్టించును. సత్యము నిన్ను మాయ నుండి వేరు చేసి స్వతంత్రుని చేయును.

దైవ ప్రేరణలోని వూహాపరంపరలో జీవుల కర్మఫలములు, సంస్కారముల ఫలితములు అనుభవించుట సహజమేయైనను దైవశక్తి అట్టి సంస్కారములు కోటానుకోట్ల జన్మలెత్తి అనుభవించునట్లు సంస్కార బంధములను సృష్టించును. ఇది సంస్కార బంధముల శాసనము వల్ల జరుగును.

భగవంతుని పరిణామ పద్ధతిలో మానవ రూపము పొందేవరకు సంస్కారములు వృద్ధియగుచుండును. జన్మ పరంపరలలో పరిమితము చేసే విధముగా సంస్కారములు వృద్ధియగుచుండును.

భగవంతుని లీలావిలాసమాగిన నాడు, అచంచలమైన శాసనము భేదించి, సత్య సాక్షాత్కార సర్వస్వతంత్ర స్థితి యొక్క అనుభూతి కలుగును.

ఇట్లావిర్భవించిన శాసనపరిధి నుండి బయటపడి దానినధిగమించి, సత్యమందు మిళితమగుట బహుకష్ట సాధ్యము. ఒక్క దైవ సమానులు మాత్రమే అనగా ఆత్మ సాక్షాత్కారము పొందిన సద్గురువులు మాత్రమే శాసన బంధముల నుండి నిన్ను విముక్తి చేయగలరు. శాసనములనగా సంస్కారములు. వారివల్ల విముక్తి పొందినప్పుడు గాని, సత్యమనే సర్వస్వతంత్రానుభూతి నీకు కలుగదు.

## 59. శక్తి జ్ఞానానందముల ఛాయలు

భగవంతునకు అనంతమైన మూడు రకముల (భావములు) గుణములు కలవు. అవి జ్ఞానము, శక్తి, ఆనందము. ఈ మూడింటినుండే మానవుడు తన పరిమిత భావములైన మనస్సు, శక్తి (పదార్థము) శరీరము వీనిని పొందకలుగుచున్నాడు.

భగవంతుని యందలి పై మూడు లక్షణములు ఒక దానిపై ఒకటి ఆధారపడియుండును. ఆనందము శక్తిపైన శక్తి జ్ఞానముపైన ఆధారపడును. అదే మాదిరి మానవుని మూడు గుణములు కూడ ఒకదానికొకటి అవినాభావ సంబంధము కలిగియుండును. పదార్థమనగా శరీరము, శక్తిపై ఆధారపడియుండును. శక్తి - మనస్సుపై ఆధారపడియుండును.

మానవ ప్రకృతికి ప్రారంభ లక్షణములు ప్రాణమనో భౌతిక రూపములే. ఇవి ఆనందమును సూచించును. ఈ మూడింటికిని భగవంతుని యందు గల మూడు విధములగు అనంతశక్తి జ్ఞానానందములతో సంబంధము కలదు.

## 60. జగత్తు ఒక కారాగారము

ఈ జగత్తు ఒక కారాగారము. అందలి ఆత్మ కుదాని స్థూల, సూక్ష్మ మనోరూప శరీరములు, కారాగారపు వూచల వెనుక వున్నట్లు భావన కలుగును. ఆత్మ శాశ్వతముగా స్వేచ్ఛ కలది. అది సర్వవ్యాపకమైన, అత్యున్నతమైన రారాజు. మాయా ప్రభావము చేత, ఆత్మ తానొక బానిసగా గుర్తించునే కాని తానే ఆత్మ అనే భావన దానికుండదు.

మాయ ఎంత బలవత్తరమైనదనగా దైవాన్ని బందీగా చేసి, ఎంతో అణకువగా అతి చాకచక్యంతో ఆయన యొక్క బానిసత్వమును స్థాపించి, బలీయమై పెనవేసుకొనును. అది ఎంత బలీయమనగా ఒక వేళ సద్గురువొకరు తన కృపను అట్టి ఆత్మపై ప్రసరింపజేసినప్పుడు ఆ ఆత్మ కారాగారపు వూచల వెనుక బంధింపబడియుండక పోయినను అది అట్లు బంధింపబడినట్లుగానే భావించును. మాయయందున్న ఆత్మకు కలిగే భావన యిది.

ఆత్మ యొక్క కారాగారవాసము భరింపరానిది. బహు బాధాకరమైనది. సద్గురువు లేక అవతారుని కృప వలన అది బంధ విమోచనము పొందును. దాని

సంస్కారములు రహితమగును. ఈ స్థితియందను భవించు ఆనందము పొందే బాధల కంటే శక్తివంతమైనది. కారాగారము విముక్తి యీ రెంటి అనుభవములు మాయా జనితములే మాయ వలననే యిట్టి అనుభవములు కలుగును. కానీ చివరకు అంత్యమందు పొందే స్వేచ్ఛ సత్యమైనది. అది సత్యపథమందలి పరమపదము. విడుదల కాబడిన నిర్బంధిత ఆత్మ అప్పుడు తన శాశ్వతత్వమును గుర్తించి, అనంతమైన స్వేచ్ఛను పొంది సదా దైవసాన్నిహిత్యము పొందును.

ఆత్మ, తన సంస్కార బంధములనెంత కాలమనుభవించునో అంతకాలమీ జగత్తు మనుచుండును. ఎప్పుడైతే సాక్షాత్కారము పొందిన ఆత్మ తానే సత్యమని గుర్తించునో ఆ మరుక్షణమే ఈ జగత్తు తుడుచుకొనిపోవును. సృష్టి అంతమగును. అది ఎన్నడు లేనట్లే భావన కలుగును. అప్పుడు ఆత్మ తానే సర్వమని, తాననంతమని శాశ్వతమని గుర్తించును.

## 61. అనంత అస్తిత్వములో ప్రయోజకత్వము

సత్యము మాత్రమే ఉండునది. ఉన్నది. అది శాశ్వతము. అనంతమైనది. అది భగవంతుని దివ్య స్థితి.

భగవంతుడు వ్యాఖ్యానించి చెప్పవీలైనవాడు కాడు. ఆదైవ స్థితికి, తన యధార్థత, అనంతము శాశ్వతమునైన శక్తి వల్ల ఎట్టి అవసరము లేదు.

దైవ స్థితియనగా పరమాత్మ స్థితి. దైవ స్థితిగా ఆ పరమాత్మ స్థితి స్మృతి పూర్వకముగా అనుభవించవలసినదే. అందువలన దైవ స్థితి, సత్యము ఈ రెండునూ నిరుపయోగమైనవే. అవి వున్నట్లు అనిపించును. అదే స్వయంకృత అస్థిత్వము.

సర్వము అనగా చరాచర సృష్టి - దైవ స్థితిలో కారణ భూయిష్టములు.

సృష్టియందలి సకల చరాచరరాసులు కారణమాత్రమై సృజింపబడినవి. అవి తప్పనిసరిగా అత్యంతావశ్యకములు. లేనిచో వాటికి దైవ స్థితియందు సహజ రూపముతో, స్వయం ప్రభావితమై యుండవు. దైవత్వమందలి వాటి వునికియే వాటి అవసరమును తెలియజేయును. ఇదే వాటి రుజువు. కానీ వాటి ఆత్మ యొక్క అవసరము దైవస్థితియందు నిరుపయోగము. అనగా అనవసరమని భావన నిష్ప్రయోజనమనునది సత్యమందలి అంతర్భాగము. ఇట్టి అవసరము కలిగియుండుట, అవాస్తవమును వదుల్చుకొని సత్యమును చేరుటేయగును.

సర్వము మాత్రమే యున్నది. ఎందుచేతననగా దానికొక అవసరమున్నది. దాని అవసరము పరిసమాప్తమైన మరుక్షణంలో సర్వము కనుమరుగగును. స్వీయ స్థితియగు దైవస్థితి అవతరించును. ఇదే పరబ్రహ్మ పరమాత్మ స్థితి.

ప్రయోజనమొక దృక్కోణమును సూచించును. దైవ స్థితి సర్వంలో, అన్నిటిలో యిమిడి యున్నది కనుక దీనికొక దృక్కోణము లేదు. ఒక విధానము లేదు. దర్శకుడుండడు. దర్శకత్వముండదు. దర్శకత్వము ఎల్లప్పుడు శూన్యమందే యుండును. దానినగమ్యగోచరమై అంతము తెలియని చోటికి చేర్చును.

అందువలన ఒక ప్రయోజన కలిగియుండవలయునన్నచో మిథ్యా గమ్యమును సృష్టించుకొనవలయును.

సర్వ అవసరములకు ప్రేమ మాత్రమే ప్రయోజనకరము దైవ ప్రేమయొక్క చిన్న కణము (రవ్వ) సర్వ అవసరములను జాజ్వ్యల్యమానముగా జ్వలింపజేయు శక్తివంతమైనది.

సృష్టియందు జీవిత గమ్యము, అంటే ప్రయోజ రహితత్వ అనగా స్థితికి చేరుట. ఇట్టి స్థితియే సత్యము. అదే పరబ్రహ్మ పరమాత్మ స్థితి.

# 62. మానసిక చైతన్యము

మనో భూమికయందున్న వారికి, స్థూల, సూక్ష్మ భూమికల చైతన్యముండదు. అటువంటప్పుడు అట్టి మనో భూమిక యందున్న వారు ఎటుల మాట్లాడకలుగుచున్నారు? ఎటుల భుజింపకలుగుచున్నారు? ఎటుల త్రాగుచున్నారు? ఇంకా ఇంకా నిత్యావసరము లెట్లు నిర్వర్తించ గలుగుచున్నారు? క్లుప్లముగా చెప్పవలెనన్నచో, విద్యుక్త ధర్మములు నిర్వర్తించ వలయునన్న, క్రియలాచరించ వలయునన్నచో ఆతడు స్థూల భూమిక యందున్న వాడు ఆచరించినట్లు ఎలా నిర్వర్తించ కలుగుచున్నాడు?

ఏలాగుననగా, సాధారణముగా మానవులు, తమనిద్రాపస్థయందు, అనగా నిద్రలో తాము నడుచుచున్నట్లు, భుజించుచున్నట్లు, త్రాగుచున్నట్లు, వ్రాయుచున్నట్లు, కల్తీ చేయుచున్నట్లు, ఇట్లా అనేక కృత్యములు చేయుచున్నట్లు భావింతురు. కానీ నిద్రావస్థలో అట్టి క్రియలు జరుపునప్పుడు యీ స్థూలచర్యలు చేయు వారు పూర్తి అచైతన్యులై యుందురు. అది జరుగుతున్నట్లు చైతన్యము వారి కుండదు. కొంత మంది నిదురలో కూడ మాట్లాడుట మీరు వినియే యుందురు. ఇది అసహజమేమీ కాదు. నిదురలో తన చుట్టూ పరివేష్టించిన వారితో జరుపు తన సంభాషణలో తాను వారితో మాట్లాడునప్పుడు అతని పలుకు బహిర్గతముగా వెలువడినప్పుడు అతని సమీపమందలి వారికి స్పష్టముగా వినపబడును. కానీ అట్లు నిదురలో మాట్లాడిన ఆ వ్యక్తికి మాత్రము తాను మాట్లాడుచున్నట్లు తెలియదు. అట్టి చైతన్యముండదు. అదే మాదిరి, మనో భూమికయందున్న వారికి కూడ పూర్తిగా వారు స్థూల, సూక్ష్మ ప్రపంచ క్రియల యందు అచైతన్య వంతులై యున్న ప్పటికి తమ మనస్సు యొక్క భావనలవలననే, వారి మానసిక ఆలోచనా పరంపరలవల్ల, వూహలవల్లనే, స్థూల, సూక్ష్మ క్రియలు

జరుగుచుండును. ఇవి అచేతనముగానే జరిగిపోవు చుండును.

మనో భూమిక యందున్న వారికి, తమ ఆలోచనలను అదుపులో వుంచుకొని, స్థూల, సూక్ష్మ భూమికలందితరుల చర్యలు అదుపులో వుంచుకొనుచూ తమ స్వీయ స్థూల, సూక్ష్మ చర్యల చైతన్యము కలిగి యుండరు. ఎందువలననగా, అట్టి స్థూల పధార్థముగాని, సూక్ష్మ పదార్థముగాని వారికొరకై నిలిచియుండదు. వారి చైతన్య స్థితి, సంపూర్తిగా స్థూల సూక్ష్మ భూమికల నుండి విడివడును. ఉదాహరణకు - ఒక సామాన్య మానవుడు తాను మానవుడనని చెప్పకుండా యుండలేడు. ఇంకా అతను తన స్థూల దేహమును గుర్తించును. అతను స్థూల చైతన్యము కలిగియుండును. అతని చైతన్యస్థితి, శరీరమనే స్థూల శరీరముతో నేరుగా సంబంధము పెట్టుకొనియుండును. సూక్ష్మ భూమిక యందున్న మరొకరు ప్రాణమనే సూక్ష్మ శరీరమును గుర్తించకుండా యుండలేరు. అదే మాదిరి మరియొకరు మనో భూమిక యందుండెనేని అతడు, మానశిక శరీరము లేక మనోమయ కోశమును గుర్తించకుండా యుండలేడు. ఈ మానశిక ఆత్మ మనోభూమిక యందుఉండి, మనస్సుగా, తన శరీరములేక ప్రాణమును ఎట్టి పరిస్థితులలోను గుర్తించలేదు. ఇది పూర్తిగా స్థూల, సూక్ష్మ శరీరములను విడనాడును. మరియు స్థూల, సూక్ష్మ భూమికలు అనుభూతులను పొందలేదు.

ఉదాహరణకు స్థూల ప్రపంచపు ప్రతీకగా భారతదేశమును వూహింపుడు. ఇంగ్లండు సూక్ష్మ ప్రపంచముగాను, మరియు అమెరికా మానసిక ప్రపంచముగాను భావిద్దాము. భారత దేశములో 'ఎ' అనునతను ఉన్నాడనుకుందాము. అతడు భారత దేశము గురించిన పూర్తి చైతన్యము కలిగి యున్నాడు. కానీ ఇంగ్లండు అమెరికాల గురించి ఎట్టి చైతన్యము వుండదు. "ఎ" ఇంగ్లాండు వెళ్లినప్పుడు అతడు ఇండియలో గాని, అమెరికాలో గాని ఉన్నట్లు స్పష్టముగా చూడలేడు. ఈ రెండు ప్రాంతములందు అతడిప్పుడు పూర్తిగా దూరమయ్యాడు. ఇంతకు ముందు కంటే అతడిప్పుడు అధికమైన చైతన్యము కలిగియున్నాడు. కానీ అతని

యీ పూర్తి చైతన్యము సర్వ సంపూర్ణంగా ఇంగ్లాండుకే పరిమితమైంది. భారత దేశము, ఆతని చైతన్య పరిధి నుండి పూర్తిగా వదలి వేయబడినది. మరి, అమెరికా ఇంకా అతని వూహ పరిధిలో ప్రవేశించలేదు.

అదే మాదిరి, ఆ "ఎ" అమెరికా వెళ్లినప్పుడు ఆతడు ఇండియాలో గాని, ఇంగ్లండులో గాని వుండడు. ఆతడిప్పుడా రెండు దేశములనుండి పూర్తిగా తొలగింపబడ్డాడు. ఇంతకు ముందున్న పూర్తి చైతన్యమును అతడు విడవకుండా పొందును. అయితే అదే సంపూర్ణ చైతన్యము ఖచ్చితంగా అమెరికాలో వుంటుంది. ఇండియా మరియు ఇంగ్లండులు పూర్తిగా చైతన్య పరిధినుండి వదిలివేయబడును.

మళ్లీ ఈ చైతన్యస్థితిని, టార్చిలైటు నుండి వెలువడే వెలుతురుతో పోల్చవచ్చును. టార్చిలైటు ద్వారా వచ్చే వెలుతురుతో అవహించబడిన ప్రదేశము చైతన్య భూమిక నొకదానిని బలపరుచును. నీ నుండి సమదూరములో నున్న త్రిగుణాత్మకమైన భూమికలు మనోసూక్ష్మ స్థూల భూమికలుగా నూహించినచో వాటిని ఎమ్.ఎస్.జి.లుగా భావించి గుర్తింపుము. ఇవి మూడును గాడాంధకారములో వున్నవి.

నీ టార్చి యొక్క వెలుతురును "జి" పై ప్రసరించినప్పుడు ("జి" అనగా స్థూల భూమిక)నీలోనే వున్న అతి సమీప భూమిక, ఈ భూమికపై వెలుతురును సరాసరి ప్రసరించవచ్చు, పూర్తిగా వెలిగించ వచ్చు. దాని యొక్క అత్యవసర సన్నిహితత్వము స్వల్పముగా టార్చిలైటు వెలుగులో వక్రీభవనము చెంది వెలుగును. "ఎస్" మరియు "ఎమ్"లలోని ప్రదేశములు మాత్రం కటిక చీకటిలోనే వుండును.

ఈ టార్చిలైటు వెలుతురును చివరకు నీ దగ్గరకు తీసుకొని, సూక్ష్మ భూమికను బలపరచే "ఎస్"పై ప్రసరింపచేసినచో "జి"లోని ప్రాంతము

గాఢాంధకారమున మునిగియుండును. ఇప్పుడు "ఎస్" మాత్రమే పూర్తిగా ప్రకాశవంతమగును. క్రొత్తగా టార్చితో వేయబడిన వెలుతురు, మందముగా ప్రసరింపబడుతూ సమీప ప్రదేశమందు ప్రసరించును.

మనో భూమికను బలపరచే "ఎమ్" వైపు నీ టార్చిలైటు వెలుతురును ప్రసరింపజేసినచో "జి" మరియు "ఎస్" ఈ రెండు ప్రాంతములు గూడ గాఢాంధకారమున మునిగియుండును. ఇప్పుడు "ఎమ్" ప్రదేశము మాత్రమే పూర్తిగా సరాసరి వెలుతురును తన వైపు తీసుకొనును. అది మాత్రమే పూర్తి వెలుతురు యందుండును. తగ్గింపబడిన మందమైన వెలుతురు, సహజముగా, యాంత్రికముగా, యీ క్రొత్తగా ప్రసరింపబడతున్న వెలుతురు చుట్టూ వెదజల్లబడును.

ఇదే వెలుతురు యొక్క కాంతి పుంజములను చివరిసారిగా ఇంకా దగ్గరకు జరిపినచో, అనగా దగ్గరగా నీ పైననే వేసినచో నీ వొక్కడివే వెలుతురులో వెలుగొందెదవు. అంతేకాని, తక్కిన మూడు ప్రాంతములు "జి, ఎస్" మరియు "ఎమ్" పూర్తిగా గాఢాంధకారములో వుండును. ఈ విధముగా నీవు నీ గురించిన సంపూర్ణ చైతన్యము మాత్రమే కలిగి ఉంటావు. ఈ చిట్ట చివరి కాంతి ప్రసరణము అనగా చైతన్యము నీ పై ప్రసరించుటే, నీ గమ్యమై యున్నది. దీనినే ఆత్మ ప్రకాశము లేదా భగవత్సాక్షాత్కారమంటారు.

మనో భూమికలో ఒకరు చేసే ఏ చర్యయైననూ, అవి స్థూల చైతన్య ఆత్మలు లేక సూక్ష్మ చైతన్య ఆత్మలచే పరిశీలించ బడినప్పటికి, అవి మానశిక చర్యయొక్క స్థూల లేక సూక్ష్మ స్థితి యొక్క అవతరణము తప్ప వేరుగాదు. నీవుగా నీ వున్న స్థూల భూమికలో నీవు చేసే ప్రతి స్థూల చర్య, మనో భూమిక యందొకడు చేయు మానసిక చర్యతో పోల్చినచో అది నీ స్థూల చైతన్యమనే తెరపై ప్రదర్శించటమే. అందువలన, మనో భూమిక యందున్న ఒకడు స్థూల,

సూక్ష్మ భూమికలను పూర్తిగా విసర్జించును. వ్యతిరేకించును. మాట్లాడడు, భుజించడు, త్రాగడు, అనగా, స్థూల భూమికయందున్న వాడు కూడ పైకి అటులనే కనపడినను, అతడు, తినును, త్రాగును, మాట్లాడును. నీవు అట్లు మాట్లాడుతూ, తినుచూ త్రాగుతూ వున్న దానిని చూచినప్పుడు, అది నీ యొక్క స్వీయ అంతఃకరణ ప్రేరణయే గాని, ఆతని మానసిక చర్యల వక్రీభవనమే గాని వేరుగాదు.

వుదాహరణకు, చంద్రుడు ఒక కొలనులో ప్రతిఫలించినప్పుడు ఎన్ని సార్లు పరిశీలించి ఎంత ఆలోచించినా నీవూహ సరోవరమందే లగ్నమై యున్నంతసేపు చందమామ ఆ సరోవరమందే యున్నట్లు గ్రాహ్యమగును గాని, అది అసలు యొక్క ప్రతిబింబమని తోచదు.

చంద్రుడు నిజానికి సరస్సులో లేడు. చంద్రుని యొక్క ప్రతిబింబమా సరస్సునందున్నది. కానీ నిజముగా చంద్రుడు నీటిలోనే వున్నాడన్నట్లు అది భ్రమగా దోచును.

దీనిని బట్టి, మనో భూమిక యందున్న వాని మనో చైతన్యము ఇక్కడ లేదు. అతని చైతన్యము యొక్క ప్రతి బింబము మాత్రమే యిక్కడ వున్నది. కానీ పైకి మాత్రము అతడు స్థూల భూమిక యొక్క చైతన్యము కలిగి యున్నాడన్నట్లు కనబడును.

మనో భూమిక యందున్న ఒకరు, ఒక చర్యను చేసినప్పుడు, ఆచర్యను స్థూల లేక సూక్ష్మ చైతన్యములో ఏ ఒక్కరు కూడ అర్థము చేసుకొనలేరు. అదే చర్యను, విరుద్ధమైన విధములుగా, సూక్ష్మ భూమికలందున్న వారు, స్థూల భూమిక లందున్న వారు కూడ వారి వారి చైతన్య స్థితుల ప్రభావము చేత వేరు వేరు విధములుగా అర్థము చెప్పుకుంటారు.

క్లుప్తముగా చెప్పవలయునన్నచో, మనోభూమిక యందున్న ఒకరి మనస్సు

యొక్క భావనను, స్థూల భూమిక యందున్న నీవు గ్రహించినప్పుడు, అది నీ యొక్క సూక్ష్మ చైతన్య స్థితి యొక్క వాహిక ద్వారా ప్రసరించబడి, నీ యొక్క జ్ఞాన శక్తి, మనో శక్తి రూపములో నిన్ను చేరును.

## 63. అవతారుని కార్య విధానము

అవతారుడు తాను స్వయముగా, ప్రాపంచిక బాధలను స్వీకరించి అనుభవించును. పరబ్రహ్మ పరమాత్మ స్థితియందు అనంత ఆనందమనుభవిస్తూ జగత్తునందలి బ్రహ్మాండమైన భారమును వహించకలుగుతున్నాడు. ఈ జగత్తుకు అవతారుడు ఇరుసు వంటి కేంద్రస్థానమైన నాయకుడు, పరిణామక్రమందలి జగత్పరి భ్రమణములో తిరుగలి రాళ్ల మధ్య యందుండే ఇరుసు వంటివాడు. అందువలన ఆయన సమస్తమునకు, సర్వమునకు బాధ్యత వహించు అధిపతి వంటివాడు.

కాలభ్రమణములో ప్రతి క్షణము అవతారుడు తానొక్కడే జగత్తునందు సృష్టి కార్యమును అనేక భంగిమలలో నెఱవేర్చుచున్నాడు. ఏలనన ఆయన సృష్టి కార్యములు కాలభ్రమణముతో సంబంధము లేనివి. తారతమ్యములు కాని దూరాభారమని కాని, దగ్గరవని కాని ఇక్కడా, అక్కడ అని గాని బేధభావము లేదు. స్థూల భూమికయందొక ప్రత్యేకమైన ఫలానా కార్యక్రమము నిర్వర్తించాలి అని వూహించినప్పుడు ఆయన ద్వంద్వముగా ఒకేసారి, అంతర్భూమికలందు కూడ తన కార్యములను చేయుచునే యుండును. భగవంతుడు సర్వాంతర్యామి కనుక ఆయన ఒకే సమయములో ఒకేసారి, అన్ని భూమికలందూ అనేక కార్యములను నిర్వహించగలడు. సామాన్య మానవుని, సాధారణ చర్యల వలె

కాక, స్థూల భూమికపైన, అవతారుని ప్రతిచర్య, దూరతీరములందలి అనేక జ్ఞానభూమికలందు సుదూర ఫలితములనేకము కలుగజేయును. అంతర్భూమికలందాయన చేసే సృష్టి కార్యము, కృషి రహితమై, శాశ్వతమై జరుగుచునేయుండును. కాని తాను సహజ స్థూల శరీరుడు కాడు, స్థూల భూమికలో ఆయన సృష్టికార్యము కడు అలసట కలిగించేదై యుండును.

వస్తుతః, సామాన్యుని ప్రతిచర్య వంటరిగా జీవించుటకు వంటరి జీవితము సాధించుటకు వుపయుక్తమగును. అది ఏదో ఒక గమ్యమును సాధించును. ఒకే గమ్యమును కేంద్రీకరించి ఆ ఒక్క ఫలితమునే సాధించును. కానీ అవతారుని విషయములో ఆయన ప్రతిదానికి అధిపతి కేంద్రము కనుక ఆయన చేసే ఏ ఒక్క చిన్న చర్యయైననూ స్థూల భూమిక యందు చేసినప్పుడు అట్టి చర్యకు ఫలితము మానవులకు వ్యతిరిక్తమైన ఫలితములు కలిగి, వాటి సహజత్వము మాత్రము ఎల్లెడల వ్యాపించి శాశ్వతమైయుండును.

స్థూల భూమికలోని అవతారుని ప్రతి చర్య, విద్యుత్ కేంద్రమందలి ప్రధాన స్విచ్ వేయుట వంటిది. మెయిన్ స్విచ్ (ప్రధాన స్విచ్) వేసినప్పుడు తక్షణమే, అన్ని సర్క్యూటులకు అన్ని లైనులకు విద్యుత్, అత్యధికమైన శక్తి శరవేగంతో నిరాఘాటముగా ప్రసరించును. అనేకానేక విద్యుత్ సర్వీసులను, వాటి బ్రాంచీలను పనిచేయునట్లు చేయును.. కర్మాగారములు పనిచేయుటకు, ఫ్యానులు పని చేయుటకు, రైళ్లు, ట్రాలీలు కదలుటకు పట్టణములందు దీపపు కాంతులు వెదజల్లుటకు గ్రామ గ్రామాన వీధి లాంపులు వెలుగుటకు అవసరమగు విద్యుత్తును ఆ ఒక్క ప్రధాన కేంద్రమందలి మెయిన్ స్విచ్ వేసినంత మాత్రము చేత ప్రసరింపచేయబడును.

అవతారుని సామాన్య శారీరక చర్య అంతర్భూమికలందనంతమైన శక్తులను ప్రభవింపచేయును. అంతటితో గొలుసులాంటి సృష్టి కార్యము ప్రారంభమగును.

అట్టి చర్యల వల్ల ప్రతి చర్యలు, ప్రతిధ్వనులు మున్నగునవి అవతరించి సర్వజనీనమై, సర్వవ్యాప్తము, విశ్వవ్యాప్తమునై వాటి ప్రభావము విశ్వంలో శాశ్వతముగా వుండును.

యీ విశ్వమందు సర్వము వున్నది. అది అనాదిగా వుంటూ వున్నది. గాడి తప్పక అనాదిగా సృష్టి ప్రారంభము నుండి సహజ దైవశక్తి సృష్టియందలి సకల చరాచరములందు అపార కరుణతో సృష్టి కార్యమునకు అవాంతరము గాని, భంగపాటు గాని, ఓడిపోవుట గాని లేదు. దైవేచ్ఛ ప్రకారము ఆయన వూహించినది జరిగి తీరవలసినదే. దైవేచ్ఛకు తిరుగులేదు. భగవంతుని సహజ లీలా విశేష సౌలభ్యమందు సృష్టి అనే జగన్నాటకమొక తిరుగులేని చలనచిత్రరాజము. లీలామానుషుడు తన సంకల్పము ప్రకారము జగన్నాటకమందు ఒక సంఘటన తరువాత మరియొక సంఘటన క్రమ ప్రకారము కాలప్రవాహములో కలుగచేయుచునేయుండును. ఏమైనప్పటికి భగవంతుడు దైవీ మానవునిగా (అవతారునిగా) అవతరించినప్పుడు ఆయన తన సృష్టియందలి సాక్షీ భూతుల మధ్య తన లీలావిశేషములపై భావమును ప్రదర్శించును. ఆయన తన అవతార ప్రజ్ఞా వైదుష్యము చేత, తనసహజ దైవశక్తి ప్రభావము వలన సంక్రమించిన సంస్కారములు లేక యే యితరమైన సంఘటనలనైననూ ఆయన కృపా కటాక్ష వీక్షణములతో అట్టివానిని రాహిత్యము చేయుటయో లేదా తుడిచివేయుటయో లేక మార్పు చేయుటయో చేయకలిగియుండును. ఇట్టి అవతారిక శక్తి, దైవము యొక్క సహజ సంకల్ప స్థితి నుండి సంక్రమించును.

సూఫీ మత ప్రవక్తలు "ఖాజా" మరియు "ఖాదరు" లను యీ విధముగా పోల్చుదురు. ఖాజా అనగా భగవంతునిచే సృజియించబడిన సంఘటనలు, ఖాదరు అనగా యాదృచ్ఛికంగా అకస్మాత్తుగా జరుగు సంఘటనలు. సద్గురువు

లేక అవతారుని చర్యలు, వారి అనంత దయాసాగరము నుండి ఉద్భవించు యాదృచ్ఛిక చర్యలే. ఇట్టి ఇచ్ఛ లేక సంకల్పము భవబంధముల విమోచనము కలిగించి ఆనంద పరవశత్వము, సమ్మోహమునుదయింప చేయును.

దైవము తొలుతగా నిర్ణయించిన దైవ ప్రణాళికలో అవసరము కొరకు మార్పులు, చేర్పులు యీ అవతారుడు చేయగలడు. కానీ అట్టి మార్పులు బహు పరిమితమై యుండును. అవతారుని సమాగమము విశ్వవ్యాప్తము, అనంతమునై, అఖండ భరితమై యుండును. ఉదాహరణకు 1950వ సంవత్సరములో ఘోర సంగ్రామము జరుగవలయునని దైవ నిర్ణయమై యున్నదనుకొనుము. అప్పుడు అట్లు నిర్ణయించిన సమయమునందా యుద్ధము జరిగి తీరవలసినదే. జరుగవలసిన సంఘటనలు అనే రైలుబండి ప్రస్తుత కాలపట్టిక ప్రకారము నిర్ణీత సమయములో సంభవించి తీరును. ఏమైననూ అవతారుడు యీ పృధ్వి పై వుండగా, అకస్మాత్తుగా యాదృచ్ఛికమైన సంఘటనలు జరిగి, స్థూల భూమికయందాయన అట్టి వినాశకర సంఘటనలను సంకల్పించి జరిగి తీరునట్లు చేయగలడు. అనంతమైన సృష్టి కార్యమునెరపుటలో అధిక శ్రమపడి విరామ మెరుగని కార్యక్రమములు చేస్తూ, సృష్టి సహజ స్వరూప శాసనములనమలు చేయుచు, ఒక్కొక్కప్పుడు దైవీకముగా, అవతారుడు దైవమాయలో ప్రవేశించి తన భావనలనప్పుడప్పుడు మారుస్తూ, మానవుని మనోఫుటలయందు యుద్ధమంతరించి శాంతి ప్రతిష్టాపించినట్లు లిఖించును. భక్త కబీరు చెప్పాడు :-

"ఓ కబీరూ! దైవ లిఖితమైన నీ కర్మ ఫలమును రాముడెన్నడు తుడవజాలడు. ఆయన సర్వశక్తిమయుడు. ఆయన చేయలేని కర్మంటూ లేదు. కానీ ఆయన ఏమీ చేయ సంకల్పించి, వాటిపై పూర్తి ఆలోచన చేసి వుంచాడో అది ఆయన చేయకుండా మాత్రము వదలడు".

సర్వసాధారణముగా అవతారుడు మానవకర్మలకు సంబంధించిన కార్యములపై నిమగ్నము కాడు. అత్యవసర పరిస్థితులు వచ్చిన సమయంలో ఆయన వాటి ప్రమేయాన్ని కల్పించుకొనును. ఆయన యొక్క ఇచ్ఛా వలయంలో తన ప్రమేయమత్యవసరమని తాను భావించిననాడు తన సంకల్పమునకు భిన్నముగా మార్పు చేయ ఇచ్ఛగించునే గాని, సాధారణముగా దైవ లిఖితమెన్నడూ వృధాపోదు. కర్మఫలానుసారము జీవి యొక్క గమనము జరిగితీరును.

ముందుగా సిద్ధము చేసిన జీవిత చక్రములోని ప్లానులో ఏదేని చిన్న సవరణ చేయవలయునన్నచో ఒకదానిపై వేరొకటి ఆధారపడి, భవబంధము లేర్పడియుండును గాన రానున్న జరుగనున్న జీవితసంఘటనలు గొలుసుకట్టుగా జరగాల్సిన వాటిలో అనేక మార్పులు చేయవలసి వచ్చును. అవతారుని ఒక చిన్న సవరణ, ఆ జీవి యొక్క అనంతజీవన భ్రమణంలో బ్రహ్మాండమైన మార్పులకు కారణభూతమగుచున్నది. నొసట వ్రాసిన బ్రహ్మవ్రాత వ్యక్తిగత జీవిత గమన పరిధిలో అనంతమైన సావలంబనకు కూర్పులే కాక ఆ జీవి గత జన్మలలో పొందిన సంస్కారముల బంధనముల ప్రభావము, వాటి వల్ల ఎదురయ్యే చిక్కులు, అవి అధిగమించుటకు లేదా ఇంకా ఎక్కువ చేసుకొనుటకీ జన్మలో ఆ జీవి చేసుకొను సంస్కార ఫలితములు యీ మొదలగు కర్మగత జీవన విధానమును సూచించును.

అవతారేచ్ఛ దైవ కర్మఫలము (అదృష్టము) లోని భాగమే ("ఖాజా") దైవ నిర్ణయ కార్యములు, అవతారుని ప్రమేయము కల్పించుకొనును. అట్లు అవతారుని మధ్యవర్తిత్వము లేదా సంబంధము కల్పించుకొనుట గురించి దైవ లిఖితమైన బ్రహ్మవ్రాత ముందుగానే జరగాల్సింది జరుగుచున్నది. జరుగబోవునది కూడ హాస్యముగా సూచించును. ఆయన యొక్క అనంతవలయములో ఆయన యొక్క ప్రమేయమును వారించుటకు గాని, తిరస్కరించుటకు గాని అవకాశము లేదు.

అవతారుని ఇచ్ఛ ప్రకారము జరుగు కార్యము కంటె భిన్నమైన కార్యక్రమము మరొకటి లేదు. దైవేచ్ఛయొక్క వుద్దేశ్యము గలది, చాల సక్రమమైనది. దాని ఫలితము కూడ సుఖమయమైనది.

కానీ సామాన్య మానవుని ఇచ్ఛ ప్రకటించినప్పుడు యీ క్రింద చెప్పబోవు కథ మాదిరి అనేక పరిణామములకు హేతు భూయిష్టము కాగలదు.

"ఒక త్రాగుబోతు, యాపిల్ ఫల వృక్షమును చూచి దాని కాయను తినవలెనని ఇచ్ఛగించెను. మామూలుగా త్రాగుడు కలవాటు పడినవారు, పులుపు, ఒగరు రుచులను వ్యతిరేకిస్తారు. కారణమేమనగా త్రాగిన మత్తునకవి విరుగుడు పదార్థములు. అందుచేత ఈ త్రాగుబోతు యొక్క యాపిల్ పండు తినవలయును అని సంకల్పించిన కోరిక, స్వచ్ఛమైన ఇచ్ఛయే అది ఆతని సర్వస్వతంత్రమైన ఆలోచన, సహజమైన కోరిక. అప్పుడతడు ఒక రాయిని తీసుకొని, చెట్టుపై విసురును. ఆ రాయి చెట్టుపైనున్న ఫలములన్నిటిని తప్పుకొని ఒక పక్షిని చంపి చాలమందికి దెబ్బలు తగులునట్లు చేసి చివరకు ఆ చెట్టు క్రింద విశ్రాంతి తీసుకుంటున్న బాటసారి నెత్తిపై పడును. ఈ రకముగా అతని అనుకొనని త్రాగుబోతు ఊహ అతని ఇచ్ఛకు వ్యతిరేకముగా జరిగి, కోరిక నెరవేరకపోవుటయేగాక, వూహించని ఫలితములు ఎదురైనవి. ఇవే హఠాత్సంఘటనలు. కోరిక అనూహ్యామైన ఊహ. క్రియలో సంక్రమించు ఫలితములు, కోరికకు అనుగుణముగా వుండవచ్చును, ఉండక పోవచ్చును. ఇది మానవ మాత్రుని కోరికలు వాటి ఫలితముల ప్రభావము.

ఈ రకమైన వ్యతిరిక్త పర్యవసానములు అవతారుని ఇచ్ఛా, సంకల్పములందు జరుగవు. దయతో ఆవిర్భవించి, సద్గురువు స్థితిలో ప్రకటింపబడి ఊహించిన ఫలితాల్ని పొందకలుగును.

# 64. క్షమించి మరచిపో

సర్వసాధారణముగా మానవులు దైవమును క్షమాభిక్ష వేడుతారు. కానీ భగవంతుడు సర్వాంతర్యామి అందరియందు అన్నిటియందు వున్నాడు గాన ఆయనను క్షమించుటకు ఆయనకు మించిన వారింకెవ్వరున్నారు? ఆయన యొక్క సృష్టి లీలా రహస్యమందెన్నడో క్షమించటమనేదున్నది. కానీ మానవులింకా భగవంతుని క్షమించమని వేడుతారు. ఆయన కూడ వారిని క్షమిస్తాడు. కానీ క్షమించబడిన వానిని ఎరిగి జ్ఞప్తియందుంచుకొనుటకు బదులుగా తప్పు చేయుట అనే అంకురమును పోషించి, పెంచి, వృక్షము చేసి, తప్పులనే ఫలములను పొందుతున్నారు. తిరిగి తిరిగి వారు నన్ను క్షమించమని కోరుచునేయున్నారు. తిరిగి, తిరిగి గురువు "నేను క్షమించాను" అని చెప్పుచునేయున్నాడు.

కానీ మానవులుగా వారి తప్పుడు పనులను విస్మరించుట (మరచుట) కడు దుర్లభము. వారి యెడల యితరులు చేసిన తప్పులను కూడ మరువలేరు. వారెప్పుడైతే మరువలేకుండా యున్నారో అప్పుడు దానిని క్షమించుట కష్టమని వారు భావిస్తున్నారు. కానీ క్షమించుట చక్కని ధర్మము. క్షమాభిక్ష చాలా గొప్పది. తనకు అష్టైశ్వర్యములున్నప్పుడు పేదలకు కూడుగుడ్డ ధర్మము చేయుట బహు తేలిక. కానీ వారిని క్షమించవలెనన్న చాలా కష్టము. ఒకవేళ ఎవరైనా అట్లు క్షమించాలంటే అది చాలా మంచి పని అగును.

మానవులొకరికొకరు విభేధించుట కంటే క్షమించుకొనుట మంచిది. ఒకప్పుడు వారు చేతులతోను, బడితలతోను కూడ కొట్టుకుంటారు. తరువాత గొడ్డళ్లు, కత్తులు, బరిశలు, విల్లులతో సిద్ధపడతారు. ఆ తరువాత తుపాకులు,

పిస్తోళ్లు మున్నగు మారణాయుధముల నుపయోగిస్తారు. ఆ పిమ్మట అణుబాంబులు కనుగొందురు. ఇటీవల అణుశక్తితో తయారై శబ్దవేగంతో మిలియన్లు కొలది మానవులను వేలకొలది మైళ్ల దూరమందున్న వారిని సైతము సంహరించగల (మిస్సెల్సు) యుద్ధ విమానములను కూడ తయారుచేశారు. వాటిని వాడుటకు కూడ సిద్ధపడుతున్నారు. వాటిని వాడుటలో మార్పు వచ్చినది కాని, మానవుని స్వభావములో మాత్రము మార్పు రాలేదు.

ప్రస్తుతము మానవులు, చంద్రమండలములో కాలూనవలయునని తాపత్రయ పడుతున్నారు. తొలుదొల్త అట్లు ప్రప్రథమముగా కాలూనిన మానవుడు తన జాతీయ జండాను, చంద్రోపరితలముపై ప్రతిష్టిస్తాడు. అప్పుడా దేశమేమనును ? ఈ చంద్ర లోకమంతా నాది అంటుంది. ఆ వెంటనే మరొక దేశము మొదటి దేశపు కోరికను వ్యతిరేకించి ఆ చంద్రమండలమును తామే స్వాధీనము చేసుకొనవలయుననే కోరికతో మొదటి దేశముతో తలపడి వివాదము పెంచుకొని యీ పృధ్వీపై యుద్ధమునకు సన్నద్ధమగును. మరి అక్కడకు ఎవరు వెళ్లినా చూడకలిగేదేమున్నది? అక్కడ శూన్యము తప్ప వేరేమి లేదు. తనను మాత్రమే తాను చూడగలడు. ఇంకా కొందరు శుక్రగ్రహము చేరదలచినచో అక్కడవారు చూచునదేమి? అక్కడ కూడ తమనే తప్ప చూడకలిగినదేమియు లేదు. మానవులు వినీల నీలాకాశపుటంచులకు ఎగిరినా, అపారపారావారపు జలనిధి అట్టడుగుకు ఈది చేరినా, వారు చూడకలిగినది వారి యదార్థ స్థితినే కాని వేరు కాదు. ఇంక ఏమియు చూడజాలరు. ఎందువలననగా తమ్ము తాము మరువలేక క్షమాభిక్ష అనునది జ్ఞప్తియందుండనందున అట్లు వారింకేమియు చూడజాలక తమ స్థితినే చూడకలుగుతున్నారు.

ఇతరుల కంటే తాను వున్నతుడనన్న భావన, మానవునికెన్నడు తనలో

భావచింతనను కలిగింపదు. అట్లు తానే వున్నతుడనను భావన కలిగి అది ఎంతగా పెరిగి జయిస్తే అంత గట్టి పడినట్లన్నమాట. తన మనస్సు తననంతగా చేయించును. ఏమని ? అసలు భగవంతుడే లేడు, తనదైన సర్వశక్తి మాత్రమే ఉన్నది అని చెప్పును. అందుచేత తాను భగవంతునితో భేదించి వేరుగ వుండును.

కానీ అదే మనస్సు అతనికి మరొకటి కూడా వివరించును. ఏమని? లేదయ్యా! అణుమాత్రమైన భగవద్స్వరూపమున్నదని బోధించును. అది పదే పదే వెనుక వుండి వంతపలుకుతూ భగవంతుని ముఖతః చూచుటకు ప్రయత్నించమని చెపుతూ వుంటే చివరకు భగవదన్వేషణ ప్రారంభించి, ఆయనను తుదకు ముఖతః గాంచి క్రమంగా తన్ను తాను మరచుట ప్రారంభించును. ఎవరివలన తాను బాధలననుభవించెనో వారిని క్షమించకలుగును.

అతను ప్రతివారిని క్షమించకలిగిననాడు తన్ను తాను పూర్తిగ మరువకలిగిననాడు తన సర్వస్వమును భగవంతుడు క్షమించెనని తెలియగలడు. మరియు నాతడు సత్యపధమునందెవరో తానూహించి జ్ఞప్తియందుంచు కొనగలడు.

## 65. అజ్ఞానపు వ్యక్తీకరణము

భగవంతుడు అవిభాజ్యుడు. ఆయన సర్వాంతర్యామి. అవిభాజ్యుడై తానన్నిటియందు ప్రతి ఒక్కరియందున వున్నాడు.

అటువంటప్పుడు మరి విభజింపబడుటకు కారణభూతములేవి? న్యాయానికి అట్టి విభజనలకు కారణభూతములు ఏవియు లేవు. కానీ

అజ్ఞానము వల్ల ఎడబాటనే విభజన, దృష్టికి గోచరించును. దీని అర్థము, సర్వమూ అజ్ఞానమయమే. ప్రతివారు అజ్ఞానమునకు ప్రతీకలే.

మహాజలనిధిలోని నీటిబిందువు వెలికితీయబడనప్పుడు అది సముద్రము నుండి వేరు కాదు. కానీ దానిని వెలికితీసినప్పుడు ఆ బిందువుపై నున్న బుడగ దాని ఎడబాటును సూచిస్తుంది. ఈ బిందువు పైకి వేరు చేయబడక పూర్వము సముద్రములోనొక ప్రత్యేకత లేకుండ సముద్రమందు లీనమై యున్నది. అట్టి బిందువుకు సముద్రపు అపరిమిత లక్షణము అక్కడున్నంతసేపు ఈ బిందువుకు కూడా గలదు. ఈ బుద్బుదము బ్రద్ధలైనప్పుడు బిందువు నశించును. మిగిలేది అవిభాజ్యమైన మహాసముద్రము మాత్రమే.

అజ్ఞానమనే బుద్బుదము నశించినప్పుడు ఆత్మ సాక్షాత్కారము పొంది, అవిభాజ్యమైన పరబ్రహ్మ పరమాత్మ స్వరూపములో లీనమై ఏకీభావమొందును.

## అవతార్ మెహెర్ బాబాకీ జై





మానవులు వినీల నీలాకాశ పుటంచులకు ఎగిరినా, అపార పారావారపు జలనిధి అట్టడుగుకు ఈది చేరినా, వారు చూడకలిగినది వారి యధార్థ స్థితినేకాని మరేదీ చూడజాలరు. ఎందువలననగా తమ్ము తాము మరువలేక, క్షమాభిక్ష అనునది జ్ఞప్తియందుండనందున, అలా వారింకేమీ చూడజాలక తమ స్థితినే చూడకలుగుతున్నారు.

- మెహెర్‌బాబా

**MEHER HOUSE**

114

## Check List

| | | | |
|---|---|---|---|
| Book Number | G.V.POIQ 127 | Date | 18-3-2021 |
| Front Cover | yes | Back Cover | yes |
| Blank Pages | 66, 67, 70, 71, 74, 75, 78, 79, | | |
| Missing Pages | NO | | |
| Prepared | G. Sowmya [illegible] | Scanned | Swathi |
| BOOK SIZE | H 8.3 W 5.5 | Pages | 117 |